# ఓటెవరికి?

(నాటిక)



రచన:

అనిసెట్టి



విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ-2.

# చదవండి

కమ్యూనిస్టుపార్టీ -
ఎన్నికల ప్రణాళిక 44 పే. 0-1-0

ఎన్నికల పాటలు 32 పే. 0-3-0

గ్రామ భాగవతం 32 పే. 0-4-0
(రాజకీయ వీధి నాటకం)

గయోపాఖ్యానం 24 పే. 0-4-0
(కార్టూన్ నాటిక)

ప్రతులకు :

**విశాలాంధ్ర ప్రచురణాలయం,**
బకింగ్‌హాంపేటపోస్టు, విజయవాడ-2

Printed at Swatantra Art Printers, Vijayawada-2.

# పరిచయం

ఆంధ్రదేశంలో నేడు మహోజ్వల చైతన్యం వెల్లివిరుస్తోంది. పీడిత, పీడక శక్తులమధ్య- ఈ ఎన్నికల సందర్భంలో- సంకుల సమరం సాగుతోంది. ఎనిమిదేండ్ల కాంగ్రెస్ దుష్ట పరిపాలనకు స్వస్తిచెప్ప సన్నద్ధులౌతున్నారు ఆంధ్రప్రజలు; ఆంధ్ర చరిత్రలోనే గాక భారతేతిహాసంలోనే ఒక సువర్ణఘట్టంను రచింపనున్నారు.

ఇట్టి సమయంలో ప్రజాభ్యుదయాన్ని కాంక్షించే ఏ రచయితా మౌనంవహించలేడు. గతాన్ని స్మరించి, వర్తమానాన్ని ప్రేమించి, భవిష్యత్తును చూడగల్గినవాడే వాస్తవిక రచయిత.

"ఓటెవరికి" అనే మూకాభినయ నాటికను రచించిన శ్రీ అనిసెట్టి పాఠకలోకానికి చిరపరిచితుడే. ఇదివరలో "శాంతి" మూకాభినయ నాటిక ఎందరో ప్రశంసల నందింది. శాంతి ఉద్యమానికి ఎంతో ప్రోత్సాహమిచ్చింది. "శాంతి" వలెనే "ఓటెవరికి" అన్న నాటికకూడా ఇప్పటికప్పుడే మద్రాసు ప్రజానాట్యమండలివారిచే ప్రదర్శించబడి లక్షలాది ప్రజల మన్ననలను పొందింది.

కొత్తగా కాంగ్రెస్ మతం పుచ్చుకొన్న జమీందారులు, లక్షాధికారులు ఎన్నికలలో అమాయక బీదజనుల్ని అదరించి, బెదరించి, డబ్బాశ చూపి ఎలా వంచింపచూస్తారో తెలియజేస్తుం దీనాటిక. క్షణిక లాభానికై తమ శాశ్వత ప్రయోజనాలకు తిలోదకాలీయ సిద్ధపడి ఊగిసలాడే రైతన్నను, చైతన్యవంతులైన తదితర రైతులు, కార్మికులు అతనిని జమీందారు

4

లక్షాధికారుల కూటమిలో పడకుండా చూస్తారు. కాంగ్రెస్ లోనే పుట్టిపెరిగిన రైతన్న తండ్రి, నేడు కొత్తగా కాంగ్రెస్ మతం పుచ్చుకొన్న పీడకవర్గాల చేతులలో దెబ్బలు తింటాడు. పీడకవర్గాలవలలో పడవద్దని కొడుకును, కొడుకు లాంటి అమాయిక బీదజనులను హెచ్చరించుతాడు.

మూకాభినయ నాటిక రచన ఒక ప్రత్యేక శిల్పం. ఇది ప్రదర్శించేటప్పుడు వ్యాఖ్యాతలకూ, నేపథ్యగాయకులకూ, నటకులకూ మధ్య సుశిక్షణతో కూడిన సమన్వయం ఉన్నపుడే ఈ ప్రదర్శన విజయవంతం కాగలదు. ఇది దృష్టిలో పెట్టుకొని సమర్థవంతంగా ఈ రచనను కొనసాగించి, ఆంధ్ర ప్రజాస్వామిక పక్షాల విజయానికి తమవంతు కర్తవ్యాన్ని నిర్వహించిన రచయిత అనిసెట్టిని అభినందింపవలసివుంది. రచనకు అన్ని విధాలా వన్నె తెస్తూ రసవత్తరంగా ప్రదర్శించిన మద్రాసు ప్రజానాట్యమండలివారినికూడ ఈ సందర్భంలో ప్రశంసించు తున్నాం.

— తుమ్మల



# పాత్రలు



## ప్రథమ ప్రదర్శనంలో పాల్గొన్నవారు

దర్శకత్వం : మిక్కిలినేని

సంగీతం : సి. మోహన్‌దాస్, చలపతిరావ్

తబలా : సుబ్బారావు

పాత్రధారులు : జమీందారు — టి. చలపతిరావు

మిల్ ఓనరు — డి. వేణుగోపాలస్వామి

ఒక వ్యక్తి — కె. సత్యనారాయణ

రైతన్న — వల్లం నరసింహారావు

కార్మికుడు — కోగంటి గోపాలకృష్ణయ్య

రక్షకుడు — రామకోటి

తండ్రి — వై. వి. రాజు

వ్యాఖ్యాతలు : మిక్కిలినేని

పి. హనుమంతరావు

వై. వి. రాజు

పెరుమాళ్ళు

నేపథ్యగానం : పసల కృష్ణకుమార్

తుమ్మల కేశవరావ్

వల్లం నరసింహారావు





జమీందారు, మిల్లుయజమానుల దుండగాలను వివరిస్తున్న తండ్రి. "ఓ కెవరికి"లో ఒకదృశ్యం.
జమీందారు, మిల్లుయజమాని, తండ్రి, రైతన్న.

# ఓటెవరికి?

## [నాటిక]

## వ్యాఖ్యాత

అదుగో వస్తున్నారు! మహానాయకులు! ఆంధ్రదేశానికి హక్కుదారుల మనుకుంటూ అధికారం చలాయించే అన్నదమ్ములు. పెద్దాయన చిన్నజమీందారు. చిన్నాయన పెద్దమిల్లుఓనరు.

ఆంధ్రదేశం వారిఆస్తి. ఆంధ్రప్రభుత్వం వారి హెడ్డాఫీసు. ప్రస్తుతం కాంగ్రెసుకు వీరే కామందులు.

ఈ పెద్దమనుషులు అధికారాన్ని ఫలహారంగా ఆరగిస్తారు. అవస్థలన్నీ అందరికీ సమానంగా పంచిపెడతారు. ఇంతకాలం అన్నదమ్ములిద్దరూ కాంగ్రెసుకాడిని ఆంధ్రునిచేత మోయించారు. ఆంధ్రుడు ఎదురుతిరిగాడు. కాడి కిందపడేశాడు. మళ్ళీ ఎన్నికలొచ్చాయి. అన్నదమ్ములిద్దరూ హడలిపోయారు. బాగాఆలోచించారు. ఆంధ్రునికోసం వెతుక్కుంటూ హడావుడిగా బయలుదేరారు.

పాట

నమస్తే! నమస్తే!
ఓ ఓటరుగారూ నమస్తే!

మేమేనోయ్ నాయకులం
మేమేనోయ్ పాలకులం
గొప్పవారమూ కోటీశ్వరులం
ఆంధ్రభూమికే హక్కుదారులం
కనికరించి ఓటిస్తారా!
కర్నూలుకు పంపిస్తారా!
నమస్తే! నమస్తే!
ఓటరుగారూ నమస్తే!

మీ ఓటే ఒక టిక్కెట్టూ
కర్నూలుబండికే టిక్కెట్టూ
పోతుందండీ కర్నూల్ బండీ
ఓటరుగారూ దయచూడండీ
బండిలో మమ్మెక్కించండి
పదవులు మాకే దక్కించండి

పోతున్నాం పోతున్నాం
కర్నూలుకు మేంపోతున్నాం
మాకు పదవులే ప్రాణాలూ
అధికారాలే మా ఆస్తి

ఘనతవహించిన కాంగ్రెస్ బిజినస్
కల్తీలేనిది కాంగ్రెస్ బిజినస్

మాలో మాకే వాటాలూ
కాదన్నవారికే తూటాలూ

ఓటిస్తారా మీకు నమస్తే!
ఇవ్వకపోతే మీపని పస్తే!!
నమస్తే! నమస్తే!

(ఒక బికారి అటువైపు పోతున్నాడు)

మిల్ ఓనరు: ఏమండోయ్ మిస్మల్నే. రండి, రండి దయ చెయ్యండి.

వ్యక్తి: ఎవర్ని, నన్నా బాబు.

జమీం: అవును మిమ్మల్నే. మే మెవరమో తెలుసా? కాంగ్రెసు నాయకులం. ఎలెక్షన్ కాండిడేట్లం.

మిల్: ఇదిగో మే మొకపని జెప్పుతాం, చేస్తావా?

వ్యక్తి: ఓ తప్పకుండా, తమ రేం చెయ్యమంటే అది చేస్తాను.

మిల్: అయితే నీ పేరేమిటో చెప్పు.

వ్యక్తి: మల్లయ్యగారి పుల్లయ్య.

మిల్: (జాబితా తీసి చూస్తూ) మల్లయ్యగారి - పుల్లయ్య...... (వెతుకుతాడు) ఆ పేరిందులో లేదే!

వ్యక్తి: ఏంది బాబూ అదీ?

జమీం: ఓటర్ల జాబితా! నీకు ఓటులేదూ?

వ్యక్తి: ఓటా! నాకు లేదుగా. కూలి ముండాకొడుకులం, ఆ ఓట్లు మాదాకా ఎక్కడొచ్చినియ్ బాబూ.

మిల్: (కోపంగా) అయితే ఎందుకూ, పెద్ద మొనగాడులాగ బయలుదేరావ్? పో పో!

వ్యక్తి: అదేంది బాబూ, ఏదన్నా పనిత్తారేఁవోనని నేనొస్తే ఎగిరెగిరి పడతారు.

జమీం: (గద్దిస్తూ) ఊఁ! పోతావా, పోవా! పో!!

వ్యక్తి: పోక మీతో నాకేంపని! ఏదో ఒకరోజుకు అందరం పోయేవాళ్ళమే.

(అతను వెళ్ళిపోతూంటే వాళ్ళిద్దరూ అతనివంక కోపంగా చూస్తూ)

జమీం: వెధవ! పనంట పని. ఈడికి పనియ్యటానికే మేము తిరుగుతున్నాం. వెధవబుద్ధులూ వీళ్ళూను.

(మళ్ళీ ఇంకెవరన్నా వస్తున్నారా అని, అటూ ఇటూ చూచుకుంటూ నిష్క్రమిస్తారు.)

వ్యాఖ్యాత: అమాయకుడు! అంధుడు! బాధలు భరించడంలో ప్రపంచ ఖ్యాతిపొందిన భారతదేశపు బక్క రైతు. ఆకాశం భూమిమధ్య ఇతనికున్న ఆస్తి బండెడు పిల్లలూ, దోసెడు కన్నీళ్ళూ! కొండంత అప్పూ, గోరంత ఆశా ఏంచేస్తాడు? ఉన్న చారెడు నేలా పూర్వమే వూడ్చుకుపోయింది. కడుపులో ఆకలి కార్చిచ్చులాగ మండుతున్న భారతీయ సాంప్రదాయాన్ననుసరించి ఓర్పువహించి, ఆశలే ఆస్తిగా ఎంచి, కొనవూపిరితో బ్రతుకీడ్చుకుంటూ వస్తు

న్నాడు. ఇరుగు పొరుగులో తలయెత్తుకోలేని నికృష్టస్థితిలో భార్యాపిల్లలే పరమశత్రువులుగా కన్పించే నిర్భాగ్యస్థితిలో బ్రతుకంటేనే వెగటుపుట్టి, చావలేక బ్రతికున్న సామాన్య రైతు అతను - అతను ఆంధ్రుడు బాధలకు పర్యాయపదం! అతను ప్రజామూర్తి - (అతనికోసమేనేమో యీ అన్నదమ్ములు వెతుకుతున్నారు.)

ఇద్దరు : ఓటరు మహాశయా నమస్తే! రండి, దయచెయ్యండి.

జమీం : ఆఁ! చూడండి! జాబితాలో పేరున్నదో లేదో.

మిల్ : (విశాలమైన జాబితాను విప్పిచూస్తూ) మీ వూరి పేరు?

రైతన్న : తెలుగునాడు.

మిల్ : అవునండోయ్, ఇది తెలుగునాడు జాబితాయే. నీపేరు?

రైతన్న : పల్లెటూరి రైతన్న.

మిల్ : ఆఁ, నువ్వేనోయ్! నువ్వే, మాకు కావలసిన ఓటువు నువ్వే. వారు మన జమీందారుగారు. నీతో స్వయంగా మాట్లాడిపోవాలని వచ్చారు.

రైతన్న : నిజంగా! జమీందారుగారా! నాకోసం వచ్చారా, నా కోసం!

జమీం : అవును, నీకోసమే వచ్చాం. ఈసారి కాంగ్రెసు తరపున మనం కాండిడేటుగా నిలబడ్డాం. నీ ఓటు తప్పకుండా మనకే యివ్వాలి. సరేనా?

రైతన్న : కాంగ్రెసా! ఈతడవ మేమంతా కమ్యూనిస్టుపార్టీకే ఓటిస్తున్నాంగా. అందరూ కలిసి ధర్మయ్యను నిలబెడుతున్నారు.

మిల్ : నువ్వుకూడానా ? ఆ కమ్యూనిస్టుకు నువ్వు ఓటియ్యడ మేంటి ? మనంఅంతా మొదటినుంచీ పచ్చికాంగ్రెసు వాదులం. కనీసం మమ్మల్నిచూసైనా ఈసారి నువ్వు మాకు ఓటియ్యాలి.

రైతన్న : మీకు మా వూళ్లో ఒక్క ఓటుగూడా పుట్టదని మావాళ్ళంతా అనుకుంటున్నారే !

మిల్ : అదేమిటోయ్, పోనీ మనల్ని చూడకపోయినా, మన వెనకాలవున్న మహాసంస్థనైనా చూడాలిగా ! అసలు మన నాయకులేమన్నారు ? చీపురు పుల్లను పెట్టినా, చిల్లపెంకుని పెట్టినా ఓట్లియ్యడం మనడ్యూటీ. మనలో ఎంతమంది గొప్పవాళ్ళున్నారో తెలుసా ? ముఖ్యనాయకులు – ఉప ముఖ్యనాయకులు– ఉద్దండులు–వుడుకుపిండాలు. మహాత్ముని దగ్గరనుంచీ మనవరకూ – అందరం కాంగ్రెసు వాళ్ళమే. అసలది పుట్టినప్పుడు నువ్వెక్కడున్నావ్ ?

రైతన్న : మీరుమాత్రం ఎక్కడున్నారు ? మీరుగూడా యీ మధ్యనే అందులో దిగారంటగా! అప్పుడు కాంగ్రెసోళ్ళని బడితెపూజ చేయించింది మీారేనంటగా ?

జమీాం : అది ఏనాటిమాట ! ఈలోపల కాంగ్రెసూ మారింది, మేమూ మారిపోయ్యాం. దానివల్ల ఎన్నెన్ని లాభా లున్నయ్యో.....అంటే దేశానికి – తెలుసుకున్నాం. తెలుసుకున్నాం.

మిల్ : మేమంతా స్వార్థంలేకుండా భారతదేశ సంపదను అభివృద్ధి చేస్తున్నాం. విగ్రహాలు పెట్టించాం – చెట్లు

నాటించాం - పటేల్ ఫండుకు చందాలిచ్చాం. పచ్చి ఖద్దరునే వాడుతున్నాం, నూలు-వడుకుతున్నాం.

జమీాం: ఒక్క నూలేవిటి! కర్మాలునే నడుపుతున్నాం - ఇదిగో, కాంగ్రెస్ జండాలు తయారుచేయించింది మనమేగా?

మిల్: ఈ మహాత్మాగాంధీగారి నమ్ముతున్నది మనవేగా?

రైతన్న: (ఆశ్చర్యంగా) ఆఁ! అమ్ముతున్నారా?

మిల్: నమ్ముతున్నామోయ్! ఆయన్నమ్ముతున్నాం. అందుచేత అందరూ కాంగ్రెసునే, అంటే మన జమీాందారుగారినే బలపరచాలి.

రైతన్న: అవున్లెండి. ఇట్లాగే కాంగ్రెసు కాంగ్రెసని అయిదేళ్ళకొకసారి పేరంటానికి పిలిచిపోతూవుంటారు. మీారు మాకు ఒరిగించేదేముంది!

జమీాం: అలా అంటావేమిటి? మన ఢిల్లీ దర్బారు ఒక పెద్ద పంచవర్ష ప్రణాళిక అమలుజరుపుతోంది. మనంకూడా ఒక బ్రహ్మాండమైన ప్లాను తయారుచేశాం. ఏఁవనుకున్నావో?

మిల్: హైస్కూలు పెట్టించాం - ఆసుపత్రి కట్టించాం - అందరికీ అన్ని సౌకర్యాలూ ఏర్పాటుచేయించాం.

రైతన్న: ఇదంతా నిజంగా జరిగిందా? ఎక్కడ జరిగింది?

మిల్: మన ప్లానులో!

రైతన్న: ఓహో ప్లానులోనా? ఎక్కడుందీ ఆ ప్లాను?

జమీాం: ఆఫీసులో.

రైతన్న : ఆ సంగతి ఐదేళ్ళనాడే చెప్పారుగా. ఆ ప్లానులన్నీ ఆఫీసుల్లోనే వుంటయ్. ఇక్కడ మా సంసారాలన్నీ గుల్లయి పోతూవుంటాయి.

జమీంం : ఇదిగో! ఈమాటలు నీవికావు. ఆ ధర్మయ్య మీటింగులో చెప్పాడుకదూ?

మిల్ : రైతన్నా! నువ్వుగూడా అతనిమాటల్లో పడిపోతున్నావా? నీ వంశం పేరుప్రతిష్ఠలు చెడగొడుతున్నావే? మీనాన్న మొదటినుంచీ కాంగ్రెసువాది. పాపం, ఆస్తి అంతా దేశంకోసం అర్పించాడు - లాఠీదెబ్బలు తిన్నాడు - జైలుపాలయ్యాడు - ఖద్దరుతప్ప మరేమీ కట్టేవాడుకాదు.

రైతన్న : అవును! ఇప్పుడు కట్టుకోడానికి గుడ్డకూడా లేదు. ఈ ముసలితనంలో మా కష్టాలు చూడలేక, పనికోసం బస్తీకిపోయాడు.

జమీంం : ఇదిగో చూడు! అందుకే నీకు మేం సహాయం చెయ్యాలని వచ్చాం. నీవంటి మంచివాడు - మేధకుడు కష్టపడుతుంటే చూస్తూవూరుకుంటామా!

రైతన్న : మీరు నాకు సహాయంచేస్తారా? మరి ఆనాడు మా రైతులంతా బంజరుభూమికోసం మొరపెట్టుకోవాలని మీ దగ్గరకొస్తే, గేటుదగ్గర రౌడీలను కాపలాపెట్టి బైటికి తరిమేశారుగా. మీరు లోపలుండి కేకలేస్తుంటే నేను చెవులారా విన్నాను.

జమీంం : ఓ, అప్పుడా! ఆ రోజున ఆ దోపిడీమూకలో నువ్వు కూడా వున్నావన్నమాట! అయినా నువ్వెందుకొచ్చావోయ్?

రైతన్న : మేం దోపిడీమూకలం కాదండీ! ఇల్లుగడవని రైతులం. ఎంతో ఆశతో బంజరు నేలంతా సాగుచేసుకుని అప్పులుచేసి విత్తనంవేశాం ! ఆ బంగారు పంటను పసిబిడ్డలాగ పెంచుకున్నాం ! అది ఇంటికి చేరేనాటికి మీరు పట్నంనుండి వచ్చి నిర్దాక్షిణ్యంగా మమ్మల్ని వెళ్ళగొట్టిస్తే, అలో లక్షణా అని మా పిల్లా జెల్లా అల్లాడిపోయాం.

మిల్లు : చాలాదారుణం ! నీ పరిస్థితి అంతాచూస్తే మా గుండె తరుక్కుపోతోంది. అయిందేదో అయిందిగాని, మా మాట విని, ఆ కూలీకుంకల స్నేహం వదలిపెట్టు. నీ కెంత డబ్బు కావాలంటే అంతయిస్తాం.



రైతన్న : డబ్బిస్తారా ? నిజమేనా !



మిల్లు : ఇక నీకీ అనుమానం అనవసరం. వారు ప్రభువులు ! ఆడినమాట తప్పడం వారికి ఆచారం......కాదు; ఇదిగో – నెత్తిన టోపీ పెట్టించుకో– ఊఁ, తలవంచు ! ఊఁ. (జేబులోనుంచి టోపీలు తీస్తూ) నిన్ను కాంగ్రెసులో గొప్ప నాయకుణ్ణి చేస్తాం. కాంగ్రెసుకు జై అను – ఊఁ.

(టోపీ నెత్తిన పెట్టబోతాడు)

రైతన్న : ఇదెందుకు నాకు; వద్దు వద్దు.

జమీాం : పోనీలే మళ్ళీవస్తాం, ఆలోచించుకో ! కాని కమ్యూనిస్టులవల్లో పడేవుసుమా ?

మిల్ : మేం గెలిచినా, ఓడినా అంతా నీమీదే ఆధారపడి ఉంది.

జమీం : కాడెద్దులనే ఆశ్రయించు-కాంగ్రెసు మంత్రం జపించు. మనల్నే బలపరుచు.

ఇద్దరు : ఆఁ! వస్తాం! ఆఁ.

వ్యాఖ్యాత : బాధలతో బక్కచిక్కిపోయిన పల్లెటూరి రైతన్న భూస్వాములు కల్పించిన భ్రమలతో పరవశమైపోతున్నాడు. ఈ నాలుగురోజులూ కష్టపడి ప్రచారంచేస్తే-కాంగ్రెసులో కలిస్తే, ఇక తన కేలోటూఉండదు.

జమీందారుగారు చాలా మంచివాడు - తనకు సహాయంచేస్తాడు -తన అప్పులన్నీ తీర్చేస్తాడు. జమీందారు దయుంటే తనుగూడా ఒక షావుకారు కావచ్చు - తానే ఊరికి పెద్ద. తనొక గొప్ప కాంగ్రెసునాయకుడు. తానొక సిల్కుచొక్కా తొడుక్కొని, జరీపంచె కట్టుకుని, చెమ్కీ చెప్పులు తొడుక్కొని బజారున నడుస్తూవుంటే గడపలమీద కూర్చున్నవాళ్ళంతా నిలబడిచూస్తారు - ఎదురొచ్చే వాళ్ళంతా నమస్కారం చేస్తారు - ఓహోహో! తనదశ తిరిగింది. తన అదృష్టం పండింది.

కర్షకుడు : అరె, ఎక్కడికి పోయావోయ్! ఊరంతా నీకోసం వెతుకుతున్నాం - ఏమి టలావున్నావ్?

రైతన్న : మీకెందుకు? నాగొడవ నాది. మీగొడవ మీది.

కర్ష : ఏమిటోయ్, అట్లా మాట్లాడతావ్. మన రైతుకూలీ లందరం కలిసి ఎర్రజండాలతో ఊరేగింపు జరిపి, చెరువుగట్టు దగ్గర మీటింగుపెడుతున్నాం. పల్లెపాలెం - పేట - అంతా

కలిసొస్తున్నారు – నువ్వు లేకపోతే ఎట్లా? ధర్మయ్య నిన్ను పిలుకుచురమ్మన్నాడు – పోదాం రా.

రైతన్న : ఆ ధర్మయ్యతో నాకేం పని? అతనేం ఆరుస్తాడా, తీరుస్తాడా! నేను రాను, మీరుపొండి.

కర్ష : అంటే? ఏం, ధర్మయ్య మంచివాడు కాదా? నిన్నెప్పుడన్నా మోసంచేశాడా?

రైతన్న : ఛీ! ఛీ! అంతమాట నేనన్నానా? మంచివాడే – బాగా చదువుకున్నాడే – కాని ఏం ప్రయోజనం!

కార్మి : నీకేం ప్రయోజనం కావాలోయ్? అతను మనలో ఒకడై కష్టసుఖాల్లో భాగం పంచుకుంటూ తిన్నా, తినక పోయినా మనతోనే ఉంటూ, కూలీ నాలీ జనం అందరికీ సేవచేస్తున్నాడు! అతన్ని గాకపోతే, మనం ఇంకెవరిని బలపరుస్తాం!

రైతన్న : అందుకే మీరందరూ పోయి, అతన్ని బలపర్చండి; నేనుమాత్రం కాంగ్రెసులో చేరతానని చెప్పేశాను.

ర్మి : ఏమిటీ? నువ్వా! కాంగ్రెసుకు ఓటిస్తావా!

న్న : అవును! జమీందారుగారు నాకు సహాయంచేస్తా న్నాడు – నాకు మాటయిచ్చాడు – ఫ్యాక్టరీ ఓనరు గారు నాకెంత డబ్బైనా ఇస్తానన్నాడు.

కార్మి : అవును, ఎంతైనా లంచం ఇస్తాడు. యుద్ధకాలంలో బ్లాక్‌మార్కెట్ చేసి, లోకుల నోళ్ళలో మట్టిగొట్టి బాగా సంపాదించాడు. మళ్ళీ అధికారం చేతికివస్తే, దీనికి పదింతలు

సంపాదిస్తాడు - తమ్ముడూ ! నీకు తెలుసా ? వాళ్ళు ప్రతి వాణ్ణీ రహస్యంగా పిలిచి ఈ మాటలే చెపుతున్నారురా !

రైతన్న : ఏమైతేనేంరా. నన్ను కాంగ్రెసులో గొప్పనాయకుణ్ణి చేస్తామన్నారు. నాకెంతో గౌరవం, పరువూ ప్రతిష్ట లొస్తాయన్నారు. అంతకంటె నాకేం కావాలి ?

కార్మి : తమ్ముడూ ! ఎందుకురా పిచ్చిలో పడతావ్, ఇంకా కాంగ్రెసు పరిస్థితి నీ కర్థంకాలేదురా ? ఈ జమీందార్లు - భూస్వాములు - మిల్ ఓనర్లు - బ్లాక్ మార్కెటీర్లు వీళ్ళంతా కాంగ్రెస్‌లోచేరి నిజంగా త్యాగాలుచేసినవాళ్ళను బైటికి తరిమేశారు.

రైతన్న : ఇదిగో ఇవన్నీ నా కనవసరం. జమీందారుగారు స్వయంగావచ్చి, నా ఓటుకోసం అడిగితే నేనుకాదనటం మర్యాదగా వుంటుందా ?

కార్మి : అయితే తమ్ముడూ ! యముడు స్వయంగావచ్చి నీ ప్రాణాలు అడిగితే మర్యాదగావుండదని ఇచ్చేస్తావట్రా ! మా మాటవిను. మనం కష్టజీవులం - కష్టజీవుల కల్పతరువు కమ్యూనిస్టుపార్టీ.

రైతన్న : అన్నా ! నాసంగతి నీకుకూడా తెలుసుగా. ఎంత మని యిట్లా అవస్థపడేది. వాళ్ళతరఫున ప్రచారం చేస్తే తలచి ఏదో ఒకకానుక ఇవ్వకపోతారా. నాలుగెకరా భూమి రాయించుకుని, రెండెడ్లూ, బండీ కొనుక్కొని...

కర్ష : అవ్వ - ఇంత అమాయకుడ వేంరా ? ఎలా నమ్మావ్ వాళ్ళ మాటలు. ఆనాడు నిన్ను జమీందారుతొత్తులు

కొట్టిన దెబ్బలు నువ్వు మరచిపోయినా, నేనుమాత్రం జన్మలో మరచిపోలేను. ఏదీ! (రైతన్న చొక్కా తొలిగించి) ఇదే నీ కతనిచ్చే కానుక – చారెడు మచ్చ – కుండెడు నెత్తురు.

కార్మి : తమ్ముడూ, నీకు తెలియదూ! నేను బస్తీవెళ్ళి ఫ్యాక్టరీలో చేరాల్సిన గతెందుకు పట్టింది? ఈ జమిీందారువల్ల కదూ? మేమంతా ఫ్యాక్టరీలో పనిచేస్తుంటే ఈ మిల్లు ఓనరు కాంగ్రెసుజెండాలు పట్టుకుని ప్రచారం చెయ్యమన్నాడు – ఒప్పుకోనివాళ్ళందర్నీ డిస్మిస్ జేశాడు! అయినా కమ్యూనిస్టుపార్టీనే బలపరుస్తున్నారు, కమ్యూనిస్టు పార్టీ నీది–నాది – అందరిదీ. మనపార్టీ గెలిస్తే పేదప్రజలే ప్రభువులౌతారు.

కర్ష : ఆంధ్రదేశంలో అన్యాయాన్నీ, అవినీతినీ అంతంజేస్తారు. ఆకలీ, దరిద్రం నశింపజేస్తారు. ప్రతి రైతుకూ భూమి, ప్రతి పౌరునికీ పని, ప్రతి ఇంటా సంతోషం, ప్రతి గుండెలో సంతృప్తి సాధిస్తాం.

ఇద్దరూ : ఆంధ్రదేశాన్ని ఆనందనిలయంగా మారుస్తాం. విశాలాంధ్రను సాధిస్తాం. త్వరగా వస్తావుకదూ? మేం వస్తాం. ఆఁ!

వ్యాఖ్యాత : రైతన్నలో స్వార్థపు సంకెళ్ళు తెగిపోతున్నాయి! ఆందోళనపడుతున్నాడు! నేను కష్టజీవులకు దూరమై పోతున్నానా! మంచీ – చెడూ, కష్టం – సుఖం ఎక్కడైనా, ఎప్పుడైనా నాకు అండగాఉండే సాటివారినే మరచి

పోతున్నానా! వారుగెలిస్తే ఆంధ్రదేశంలో ఆకలి, దారిద్ర్యం అంతమౌతాయా? ప్రతియింటా సంతోషం, ప్రతిగుండెలో సంతృప్తి నిజమేనా? నా చితికిపోయిన సంసారంలో, చివికిపోయిన మనస్సులో నవోదయం కలుగుతుందా? ఆంధ్రదేశం ఆనందనిలయంగా మారుతుందా?

(జమీందారు, ఫ్యాక్టరీ ఓనరు తిరిగి వస్తారు.)

జమీం: ఊఁ! ఊఁ! రైతన్నా! రా పోదాం. తెచ్చాం, పెద్ద బ్యూకుకారు - వచ్చారు మన వలంటీర్లు! మనదగ్గర డబ్బుంది! దర్జావుంది. మనకేం లోటు. పోదాం రా.

మిల్: నీకు సన్మానం చెయ్యబోతున్నామోయ్! నిన్నిప్పుడే నాయకుణ్ణి చేస్తున్నాం, రా!

రైతన్న: నేను రావాలా! ఎందుకు రావాలి? కాంగ్రెసంతా కల్మషంతో నిండిపోయింది గదూ! కష్టజీవుల కడుపులు కొట్టేవాళ్ళంతా కాంగ్రెసును నడుపుతున్నారు గదూ!

మిల్: ఓహో అంతవరకొచ్చిందీ! పిచ్చివాడా! ఇప్పుడు యేంవచ్చింది. ఒక్క కాంగ్రెసుతరఫునే కాదు - తెలిసిందా? మనలో ఇప్పుడు రెండు పార్టీలొచ్చి కలిసిన్నై.

జమీం: అవును. కృషికార్ లోక్ పార్టీ ఎవరికోసం పెట్టారు - రైతులకోసం. ప్రజాపార్టీ ఎందుకు? ప్రజలకోసం! మన కిమిలాఖత్ ఎందుకు? ప్రజాస్వామ్యం కోసం! భారత దేశం బాగుపడాలంటే మనమంతాకలసి కమ్యూనిస్టుపార్టీని బహిష్కరించాలి- కాంగ్రెసు నిలబడాలంటే కమ్యూనిస్టుల్ని

కాల్చెయ్యాలి - ఏది ఏంకావాలన్నా కమ్యూనిస్టుపార్టీ నాశనం కావాలి.

రైతన్న : ఊఁ, అసలు సంగతి అదన్నమాట! అయితే నేను రానే రాను! వెళ్ళండి, మీరు వెళ్ళండి!

మిల్ : (యుక్తిగా) రైతన్నా! ఏమిటీకోపం! భారతదేశపు బక్కరైతు పస్తులైనా పడుంటాడుకాని వల్లెత్తి మాట్లాడడని ప్రపంచ ఖ్యాతి పొందాడు.

జమీం : రైతన్నా, నీవూ నేనూ అన్నదమ్ములం. నేనూ, నీవంటి రైతునే. ఇంకా నేనే నీకంటే అన్యాయం. నేను వ్యవసాయం చేతగాని రైతును - చూడు- అన్నింటికంటే ముఖ్యం - మనం సాటి కులస్తులం - మనం ఒకరి కొకరు సహాయం చేసుకోకపోతే మనకులం ఏమైపోతుంది? ఆ ధర్మయ్య కులం ఏమిటో అసలు నీకు తెలుసా ?

రైతన్న : నాకేమీ తోచడంలేదు - నామనస్సేమీ బాగా లేదు. పోనీ నే నొక్కణ్ణే ఓటివ్వనంతమాత్రాన కాంగ్రెసు ఓడిపోతుందా ?

మిల్ : అమ్మ బాబో! ఈసారి ఒక్క ఓటుకూడా పోవడానికి వీల్లేదు. మొన్న మా ప్రభుత్వం ఒక్క ఓటువల్లనేగా ఓడిపోయింది. అందుకేగా మేమింత కష్టపడాల్సిన ఖర్మ పట్టింది.

చూడు! రేపు నీ కేదన్నా అవసరమొస్తే కమ్యూనిస్టులు ఆదుకుంటారా? ఎప్పటికైనా మనం మనం ఒకటి. ఊఁ, రెండువేలు - రెండువేలు - నీ దగ్గరుంచవోయ్ !

(డబ్బివ్వబోతాడు; కాని రైతన్న తీసుకోడు) కాంగ్రెసుకే ప్రచారం చెయ్యి. ఎలక్షన్లయిపోగానే మన జమీందారుగారు ఆ చెరువుకింద నేల పదెకరాలూ నీ పేర వ్రాస్తానని అంటున్నారు.

రైతన్న : (ఆశగా) పదెకరాలా ? నాకా ? మీకు నామీద నిజంగా ప్రేమ వుందన్నమాట.

జమీం : తప్పకుండా ! నీ కూతురు పెళ్ళికి ఎంత కట్నం కావాల్సొస్తే అంతా తీసుకుందువుగాని. నీ పాతిల్లు పడగొట్టి కొత్తయిల్లు కట్టిస్తాను. నేను గెలిస్తే నీకు పర్మిట్లు ఇప్పిస్తాను.

రైతన్న : మీకే సహాయం చేస్తాను ! కానీమావాళ్లంతా నేను ద్రోహంచేశాననుకోరుగదా !

మిల్ : వాళ్ళ మొఖం; చూడు మీ నాన్నను పేటలో మన ఆఫీసుకు పిల్చుకుపోయారట. ఆయనలాంటి అనుభవజ్ఞుడు, త్యాగమూర్తి, వృద్ధుడు మనకు సహాయం చేస్తుంటే నువ్వు కాదంటావా ?

రైతన్న : చూస్తాను ! సహాయం చేస్తాను.

జమీం : మాకు తెలుసు, రైతుల తత్వమే అంత. మాటంటే ఇక ప్రాణంపోయినా మనసు మార్చుకోడు. ఊఁ ! ప్రమాణం చెయ్యి !

(రైతు చేయి పట్టుకొని ఇద్దరూ ప్రమాణం చేయించడానికి ప్రయత్నం చుతారు).

మిల్ : నా బిడ్డలు తోడుగా నేను కాంగ్రెసునే బలపరుస్తానని ప్రమాణం చెయ్యి ! ఊఁ ! చెయ్యి.

(నినాదాలు)

(అంతలో బయటనుండి "కమ్యూనిస్టుపార్టీకి జై" అని నినాదాలు విని పిస్తాయి. వాళ్ళిద్దరూ రైతన్నను హడావుడిగా బైటికి తీసుకుపోవాలని ప్రయత్నం చేస్తూవుంటారు.)

జమీం : ఆఁ, ఆఁ. పోదాంపద; వాళ్ళు నీమీద పగబడతారు. నీ ప్రాణం తీసేస్తారు !

(కార్మిక కర్షకులు ఎర్రజండాలతో ప్రవేశిస్తారు.)

కార్మి, కర్ష : ఆగు రైతన్నా ! ఎక్కడికి పోతున్నావ్ ?

(జమీందారు, మిల్లు ఓనరు ఆమర్దాగా అతన్ని బైటికి తీసుకు పోతుంటారు.)

జమీం : పద పోదాం ! పదా, పదా.

కర్ష : ఆగు రైతన్నా, ఆగు? ఎందుకంత భయం? పారిపోతావేం, ఆగవోయ్ ! (ఆ మాటలు విన్న రైతన్న - విదిలించుకుంటాడు)

రైతన్న : ఏమిటది ? వాళ్ళేంచెప్తారో వింటాను. వాళ్ళేం చేస్తారో చూస్తాను.

జమీం : అయితే వెంటనే వచ్చేస్తావు గదూ ?

మిల్లు : మాటిచ్చావ్ మర్చిపోవద్దు ! నువ్వు రాకపోతే, మేమే నీ కోసం వస్తాం ! జాగ్రత్త !

(ఇద్దరూ వెళ్ళిపోతారు)

కర్ష : అందరం కలిసి అక్కడ మీటింగు జరుపుతూవుంటే నీకు వీళ్ళతో గుసగుస లేమిటోయ్ ! ఛీ ! మన రైతు వర్గానికే సిగ్గుచేటైనపని చేస్తున్నావ్ !

రైతన్న : ఇందులో సిగ్గుపడాల్సినపనేముంది. వాళ్ళు నాకు డబ్బూ, భూమీ యిచ్చి సహాయం చేస్తామన్నారు. నేను కాంగ్రెసుతరపున ప్రచారం చేస్తానన్నాను.

కార్మి : అన్నా ! ఇంతేనా నీ తెలివి ! ఆశపెట్టిన వాళ్ళందరికీ నీ అంతరాత్మను అమ్ముకుంటావా ? వాళ్ళదగ్గర లంచాలు తీసుకోడానికి సిద్ధపడతావా ?

రైతన్న: అయితే వాళ్ళిచ్చినా నేను తీసుకోవడం తప్పంటావా?

కార్మి : తప్పుకాదు పాపం. పేదవాళ్ళు ఎంత హీనాతిహీన స్థితిలోవున్నా భాగ్యవంతుల తియ్యనిమాటలకు మోసపోరు. వాళ్ళ ఎంగిలిమెతుకులకు ఆశపడరు. సాటివారికి ద్రోహం చెయ్యరు. మనం మహారాజులు ప్రసాదించే దాన ధర్మాల మీద బ్రతికే పశువులంకాదు. మనుషులం. మనిషిగా నీ ధర్మం నెరవేర్చుకో. గొప్పవాళ్ళ గులామువై నీ స్వార్థం చూసుకుంటావా ? పేదవాళ్ళ బంధువువై సామ్యవాదం సాధిస్తావా ?

రైతన్న: అదంతా సరేగాని, వాళ్ళు మాకులంవాళ్ళేగా. వాళ్ళకు సహాయం చేస్తానంటే తప్పేముంది !

కర్ష : అయితే కులాన్నిబట్టి ఓటియ్యడం న్యాయమంతమ్ముడూ! ఈకులాలు, మతాలతోనే మన దేశం కుళ్ళిపోయింది. సంఘం విచ్ఛిన్నమై పోయింది, ప్రపంచంలో ఇవ్వాళున్న కులాలు రెండే రెండు – ధనవంతులు – దరిద్రులు – కష్టపడి పనిచేసే కులంమనది. మనుషులరక్తాన్ని డబ్బుగా మార్చేకులంవాళ్ళది.

రైతన్న: అయితే నువ్వనేదేంటి ! అసలు కాంగ్రెసుకే మనం సహాయం చెయ్యగూడదంటావా ? వాళ్ళు దేశానికి ఎంతో మేలుచేశా మంటున్నారే !

కర్ష : ఎందుకు చెయ్యాలా ! బంజరుభూములు సాగుచేసు కుంటుండే మనందరనీ వెళ్ళగొట్టి పుణ్యం కట్టుకున్నారుగా !

గీత కార్మికులు పస్తులుపడుకోలేక సత్యాగ్రహంచేస్తే అందరినీ హాయిగా జైళ్ళలోవుండమన్నారు. ఇప్పుడు రైతులంతా ధాన్యంధరలు పడిపోయి చేతిలో దమ్మిడీలేక నానా అగచాట్లు పడుతుంటే, మళ్ళీ వచ్చి మీ ఓటు మాకే ఇవ్వండంటున్నారు!

రైతన్న : పోనీ ఈ తడవ పల్లెటూళ్ళకు ప్రత్యేకంగా సహాయం చేయించుకుందాం లెద్దూ! తప్పకుండా ఈ సారి చేస్తారు.

కర్ష : ఏమిటి వాళ్ళు చేసేది? ఇంతకుముందు వాళ్ళ ప్రభుత్వం రైతులకు చేసిన వుపకారం నీకు తెలియదూ? భూమికోసం పల్లె ప్రజలు ఆందోళన సాగిస్తే, మనమీద పోలీసు దాడులు జరిపించింది. రత్నాల్లాంటి ప్రజాసేవకుల్ని కాల్చేసింది. తమ్ముడూ, వారి ప్రభుత్వం దేశాన్ని బంధిఖానాగా తయారు చేసింది, ప్రతి చెట్టూ ఉరికంబంగా మారిపోయింది. నీకు జ్ఞాపకం లేదూ? ఎలమర్రు, కాటూరులలో అమాయకులైన స్త్రీ పురుషులను ఎంత అమానుషంగా అవమానించారో నీకు జ్ఞాపకంలేదూ? మన నాయకుడుగా వుండి, ప్రజాసేవకోసం జీవితం అంకితంచేసిన ( పేరు ) క్రూరంగా కాల్చి చంపేశారే, జ్ఞాపకంలేదూ! తమ్ముడూ, వాళ్ళు చేసిన పనులు తలుచుకుంటే ఒళ్ళు జలదరిస్తుంది. వీళ్ళను ఓడించాలని పిడికిలెత్తి ప్రతిజ్ఞ చెయ్యాలనిపిస్తుంది! ఆలోచించుకో, బాగా ఆలోచించుకో. దురాశకు పోయి, దేశానికి ద్రోహం చేస్తావా – ద్రోహం చేస్తావా!

.. : తమ్ముడూ! దురాశకుపోయి దేశానికి ద్రోహం చేస్తావా? ఆలోచించుకో! బాగా ఆలోచించుకో!

రైతన్న : నేను ద్రోహంచెయ్యను! ఎప్పటికీ ద్రోహం చెయ్యను అన్నా! మిమ్మల్ని విడిచిపెట్టి నే నెన్నటికైనా వెళ్ళగలనా! నేను మీతోనే వుంటాను.

శార్మి : మనమంతా ఒక్కసారి ఏకంగా గొంతెత్తి చెబుదాం!
కూడూ-గుడ్డా-నీడా-నేలా- జనులందరికీ జన్మహక్కు-రా!
శాంతీ-సౌఖ్యం-సంపద-స్వేచ్ఛా సాధించండోయ్ సోదరులారా!

కర్ష : పేదవాళ్ళ ఆశయాలలోనే పెన్నిధు లున్నాయి తమ్ముడూ! మనం తప్పకుండా జయిస్తాం తమ్ముడూ! ప్రజలకోసం ప్రాణాలర్పించిన అమరవీరుల్ని జ్ఞాపకం తెచ్చుకో - అరుగో వాళ్ళు నిన్ను హెచ్చరిస్తున్నారు. కమ్యూనిస్టు పార్టీని గెలిపించమంటున్నారు-రా - పోదాం-రా వీధివీధికీ - గడపగడపకూ - గుండె గుండెకూ ప్రచారం అందించుదాం, రా!

—• పా ట •—

## బృందగానం "అన్నదమ్ములారా"

కూడూ-గుడ్డా-నీడా-నేలా- జనులందరికీ, జన్మ హక్కు-రా!
శాంతీ! సౌఖ్యం! సంపద! స్వేచ్ఛా సాధించండోయ్ సోదరులారా!

(వాళ్ళు పాడుకుంటూ వెళ్ళిపోతూవుంటే రెండవవైపునుండి జమీ దారూ, మిల్ ఓనరూ వస్తారు.)

జమీం : ఏయ్ రైతన్నా! ఎక్కడికి పోతున్నావ్! నీ వ[illegible] నిలబెట్టుకో; కాంగ్రెసుకే నీ ఓటు.

(రైతన్న ఏమీతోచక అలాగే మధ్య నిలబడిపోతాడు.)

కర్ష :తమ్ముడూ!కమ్యూనిస్టుపార్టీ మనపార్టీ!కమ్యూనిస్టుకేనీ[illegible]

మిల్ : కాదు, కాంగ్రెసుకే నీ ఓటు !

కార్మి : కాదు ! కమ్యూనిస్టుపార్టీకే నీ ఓటు !

మిల్ : కమ్యూనిస్టులు దేశద్రోహులు - మేం దేశభక్తులం. వాళ్ళు భారతీయులు కాదు; రష్యా ఏజంట్లు, తెలిసిందా?

కర్ష : అసలైన దేశ సేవకులం మనమే. ఈ దేశంలో పుట్టాం, ఇక్కడే పెరిగాం, ఈ దేశంకోసమే మన ప్రాణాలు బలి చేస్తున్నాం.

జమీం : మేం దేశోద్ధారకులం ! అహింసామూర్తులం.

కర్ష : అది అహింస కాదు - చిత్రహింస ! క్షణక్షణం దారిద్ర్యంతో దేశాన్ని చిత్రహింస చేస్తున్నారు.

మిల్లు : కమ్యూనిస్టుపార్టీ కుట్రలుపన్ని కూలి - నాలి జనాన్ని మోసంచేస్తుంది.

కార్మి : కామందుల కూటమి కాంగ్రెసు. కష్టజీవులపార్టీ కమ్యూనిస్టుపార్టీ.

జమీం : కమ్యూనిస్టుపార్టీని ఈ దేశంలో బహిష్కరిస్తాం. నాశనం చేస్తాం.

కర్ష : కమ్యూనిస్టుపార్టీ కలకాలం వర్ధిల్లేపార్టీ. కష్టజీవులరక్తంలో ప్రతికణమూ కమ్యూనిస్టుపార్టీనే కలవరిస్తోంది !

మిల్ : విప్లవాలు ! విఘాతాలు కల్పించడం వాళ్ళవిధానం. వాళ్ళను నాశనంచెయ్యడం మా విధానం.

కార్మి : దుష్టుల్ని హతమార్చడం మాధర్మం; మాది సమధర్మం, నవధర్మం, మానవధర్మం. (జమీందారు, మిల్ ఓనరు రైతన్నను లాక్కుపోతూవుంటే అతను వెంట వెళ్ళబోతున్నాడు. అతని తండ్రి రక్తసిక్త వస్త్రాలతో తూలుతూ లోపలికివస్తాడు.)

తండ్రి : అబ్బాయ్ ! ఒరబ్బాయ్ ! ఎక్కడున్నావు నాయనా !

(రైతన్న నిర్ఘాంతపోయి తండ్రిని కౌగలించుకుంటాడు. తండ్రి ఆపాద మస్తకం వొణికిపోతూ, కాళ్ళు నిలదొక్కుకుంటున్నాడు.)

రైతన్న : నాన్నా ! ఏమిటి నాన్నా ! ఇట్లా అయిపోయావు, ఏమైంది ! ఏంజరిగింది నాన్నా !

తండ్రి : ఏంజరగాలో అదే జరిగిందిరా, ఇంతకంటె మనల్ని ఎవరేంచేస్తారు !. నీ వేమైపోతావో ! ఎవరితో కలుస్తావో, ఏంచేస్తావో అని ఆదుర్దాగా వచ్చేశా! (జమీందారు, మిల్లు ఓనరుల వంక చూసి) వీరెవరు? ఓహో ! జమీందారుగారా? ఇక్కడికెందుకొచ్చారు ?

రైతన్న : నాకోసం వచ్చారు నాన్నా !

జమీం : అవును రైతన్నకోసమేవచ్చాం. అతనితో స్వయంగా మాట్లాడాలని......

తండ్రి : హుం ! మేమంటే ఎంత ప్రేమ !

జమీం : నిజమే ! మాకు మీ మీదకాకపోతే యింకెవ్వరి మీద ప్రేముంటుంది చెప్పు.

తండ్రి : మాకు తెలుసు. మీ ప్రేమ ఎట్లాంటిదో మాకు బాగా తెలుసు ! గొర్రెలమీద కాకపోతే, కసాయివాడికి ఇంకెవరి మీద ప్రేముంటుంది ! మీ ప్రేమ ! మీ పెద్దరిక దయాధర్మాలు మా గుండెల్లో ఎర్రని గాయాలుగ మారినై. మా ఒళ్ళంతా తూట్లు పొడిచినై, మళ్ళీ ముఖంతో ఓట్లడగటానికి వచ్చారయ్యా - ఇంతకాలం ఆంధ్రదేశం ఇట్లా అల్లాడిపోవటానికి మీరుగాదూ కారణం. పల్లెటూళ్ళను కొల్లగొట్టారు ! మా ఇళ్ళన్నీ గుల్లచేశారు. (ఆవేశంతో) ఎంతకాలం మీ ఆటలు సాగుతాయ్! ఎంత కాలం ఇట్లు నాటకమాడుతారు.

మిల్ : అదికాదండీ! జమీందారుగారు.

తండ్రి : ఇంకా ఎందుకయ్యా చెపుతావ్! మాకు తెలుసు! జగమెరిగిన పాపాత్ములు జమీందారులు, ఇప్పుడీ దేశంలో వాళ్ళ మోసాలకు లొంగిపొయ్యే మూర్ఖుడెవడూ లేడు! మేం కష్టా లనుభవించాం. కళ్ళు తెరచి చూస్తున్నాం. కాంగ్రెసుకు మేం ఓటివ్వడంకల్ల. (కొడుకు చేతిలోవాలిపోతాడు.)

రైతన్న : (ఆదుర్దాగా) ఏమిటి నాన్నా! ఇట్లా అయిపొయ్యావేం! గుడ్డలన్నీ చిరిగిపోయినయ్ ఏం! ఏం జరిగింది?

తండ్రి : ఏంజరిగినా ఫర్వాలేదు! ఈప్రపంచంలో పేదవాడుగా పుట్టటడమే తప్పు. పుట్టిన తరువాత ప్రాణంపోయినాసరే నిజాయితీకోసం నిలబడాల్సిందే! బస్తీలో ఎక్కడన్నా నౌకరీ దొరుకుతుందేమోనని నేను వెతుకులాడుతుంటే వాళ్ళొచ్చి కాంగ్రెసుఆఫీసుకు పిల్చుకపోయారు. కాంగ్రెసు కోసంప్రచారం చెయ్యమన్నారు. ఆనాయకులకీచులాటలూ, పేచీలూ, కుట్రలూ చూశాను. నాకు కళ్ళు తిరిగి పోయిన్నై. ఆంధ్రదేశం తమ కౌలుభూమి అనుకుంటున్నారు. సాగుచేసుకుని అనుభవించాలనుకుంటున్నారు. చెప్పేశాను. గట్టిగా చెప్పేశాను. ఈ జమీందార్లు, పెత్తందార్లుచేరిన కాంగ్రెసు దేశానికి చేటుతెస్తుందని చెప్పాను. నేను గొంతులో వూపిరుండగా ఈ కాంగ్రెసుకు సహాయం చెయ్యనని చెప్పాను. నేను బయటికి రాగానే జమీందారు రౌడీలు నామీదబడి దారుణంగా కొట్టారు; వాళ్ళంతా హూనం చేశారు. అబ్బ! అబ్బ!

ఇప్పుడు నిజం తెలిసిందిరా! ఇప్పుడు నిజం తెలిసిందిరా! ఇప్పుడు కాంగ్రెసు పెద్ద వ్యాపారసంస్థగా మారిపోయిందిరా! ఇది గాంధీగారికాంగ్రెసు కాదు! కామందుల కాంగ్రెసు! దేశం మారిపోయింది - మనుషులు మారిపోయారు - వింటున్నావా - వింటున్నావా—

(కార్మిక, కర్షకులు ప్రవేశం)

రైతన్న: వింటున్నా నాన్నా.

తండ్రి: మీరూ వింటున్నారా! ఈనాటి కాంగ్రెసు ఆనాటి జస్టిస్‌పార్టీగా మారిపోయిందిరా! ఎన్నో త్యాగాలుచేసిన ఆనాటి కాంగ్రెసు, ఈనాడు కమ్యూనిస్టుపార్టీగా ఏర్పడిందిరా! దేశానికి మేలు చెయ్యాలంటే కమ్యూనిస్టులే చెయ్యాలి. దేశం బాగుపడి ప్రజలంతా సుఖపడాలంటే కమ్యూనిస్టులే గెలవాలి...ఏమంటావ్ నీ...ఓటు ఎవరికిస్తావ్...ఎవరికిస్తావ్.

రైతన్న: కమ్యూనిస్టు పార్టీకే నాన్నా.

తండ్రి: (కార్మిక కర్షకులతో) మీ ఓటెవరికి.

కార్మి, కర్ష: కమ్యూనిస్టు పార్టీకే!

తండ్రి: (ప్రేక్షకులతో) మీ అందరి ఓట్లు ఎవరికిస్తారు?

గొంతులు: కమ్యూనిస్టు పార్టీకే!

తండ్రి: ఎవరికి?

గొంతులు: కమ్యూనిస్టులకే.

తండ్రి: ఏ పెట్టెలో?

గొంతులు: కంకి, కొడవలి పెట్టెలోనే.

(తెర)



# కమ్యూనిస్టు పార్టీ ఎన్నికలగుర్తు



(జనరల్)



(రిజర్వుడు)

## కంకి - కొడవలి గుర్తుగల పెట్టెలోనే మీ ఓటు

Swatantra Art Printers, Vijayawada-2.

# ఇంద్రజాలం

[వీధి నాటకం]



కోగంటి గోపాలకృష్ణయ్య

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

# ఇంద్రజాలం

[వీధి నాటకం]



రచన:

కొగంటి గోపాలకృష్ణయ్య

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

# పాత్రలు



| | | | |
|---|---|---|---|
| 1. | రామజోగి | .... | ముఖ్యమంత్రి |
| 2. | మహాభోగి | .... | ఉపముఖ్యమంత్రి |
| 3. | ప్రజానాధం | .... | ఆర్థిక మంత్రి |
| 4. | లోకనాధం | .... | నడమంత్రపు మంత్రి (పరిపాలన 2 నెలలు మాత్రం) |
| 5. | భూపాలరావ్ | .... | ప్రదేశాధిపతి |
| 6. | పాపారావ్ | .... | ప్రతిపక్షనాయకుడు |

... ఇంకా ...

రైతుకూలీలు, విదూషకులు

| | | |
|---|---|---|
| ప్రదేశం | .... | ఇంద్రలోకం |
| సమావేశం | .... | ఇంద్రసభ |
| కాలం | .... | "ఆనాడూ |
| | .... | ఈనాడూ" |

# ఇంద్రజాలం

## [ వీథినాటకం ]



## ఒకటో రంగం

### నాంది:

ఆంధ్రరాష్ట్రసిద్ధి కసువు లర్పించిన
పొట్టి శ్రీరాములున్ ప్రస్తుతింతు
జాతియోద్యమ చరిత జగజెట్టి లన్పించు
త్యాగశీలురకు జోహారుసేతు.

ప్రార్థన — ఆటతాళం - కాంభోజిరాగం

అంబా పరాకు - దేవీపరాకు
మమ్మేలు మా - ఆంధ్రమాతా పరాకు
పాడిపంటల నిచ్చి - భోగ భాగ్యాలిచ్చి
చల్లగ దయజూడు - తల్లి పరాకు
తెలుగుజాతిని మేలు - కొలిపినట్టి దిట్ట
పొట్టి శ్రీరాములు - సాక్షి పరాకు
కలకాలము మమ్ము - కాపాడగ నిన్ను
కొలుతుము, ఓ కల్ప - వల్లీ! పరాకు !

ప్రసిద్ధి కెక్కగ - అంబ
ప్రజారాజ్యమును - అంబ
విశాలాంధ్రలో - అంబ
నెలకొల్పెదమో - యంబ - భరతాంబ

వ. అని యీ ప్రకారంబున భారతదేశ భాగవతంబున పంచమ స్కంధంబున "ఇంద్రజాలం" అను ఆంధ్రదేశ అంతర్నాటక సంవిధానంబునకు కథాక్రమం బెట్టిదనిన—

సేవ: భారతీయులారా! ఆంధ్రమాత అనుంగు బిడ్డలారా! మరపురానట్టి మహత్తర త్యాగంతో, మహోజ్వల శక్తితో రాష్ట్ర నిర్మాణంబు జరిగిన అనంతరంబ, దమన నీతితో 13 నెలలు ప్రభుత్వంబు సాగించి అపరత్రిశంకుడో యన ప్రధాని సభారంగమునకు అరుదెంచుచున్నవారలని దెల్ప వచ్చియున్నాడ. మీ రెల్లరు గల్లంతుసేయక వారు సెలవిచ్చునది ఆలకింప గోరుచున్నాడ.

[ రామజోగి ప్రవేశము ]

కీర్తన—ఆదితాళం - సావేరి రాగం

రామజోగిని చూడరే - రాచకీయ చతురుని
ఊసరివెల్లిగ -. వేసము వేయుచు
కేసరిత్తానని - కేకలు వేసెడి ॥రామ॥
సీటుకోసమై - కోటు మార్చుచు
గద్దె లెక్కిన - పెద్దను నేనను
పదవుల వేటలో - ప్రాకులాటలో
ప్రథముడు తానై - పరుగున వచ్చెడి

సేవ : వృద్ధ జంబుకాగ్రేసర చక్రవర్తీ! బహుపరాక్ ! బహు జనాభిప్రాయ నిరసన దీక్షానువర్తీ! బహుపరాక్ !

రామ : సెహబాస్ ! ఆ సెబాస్ కేమిలేరా సేవకా! మాయో పాయంబు లెన్ని పన్ననను మాకిప్పుడు చావుదప్పి కన్ను లొట్టబోయినంత పని జరిగినది గదరా.

వంత : అదేమి మహామంత్రీ! ప్రజలే మీరనీ, మీరే ప్రజలనీ సెలవిచ్చు చుండెడివారు గదా, ఇంతలో —

రామ : ఎంత కావలెనురా, మనమాట విననప్పుడు ప్రజలు ప్రజలే, మనం మనమే. అయినా ప్రజలను చెప్పింది చేయ మన్నాం కాని విని విమర్శించమన్నామటరా. తిరిగి అవస రం వచ్చింది కాబట్టి ఆ అలగాజనం ఆసరా అంతో యింతో కావలసివచ్చె—అన్నట్లు యీ దద్ద యాగంబును తనపెద్దలకు నివేదింప ఉత్తరాదికి వెళ్లిన ఉపముఖ్యమంత్రి యింకను రాకుండుటకు గతంబేమై యుండనోపు ?

సేవ : మాటలోనే మూటవేసుకొని మన ఉపముఖ్యమంత్రి రయంబున చనుదెంచు చున్నవారలు రామజోగి మహాశయా !

రామ : జాగుసేయక సత్వరంబ రప్పింపుము.

[ మహాభోగి ప్రవేశం ]

కీర్తన — ఆదితాళం - పూరికళ్యాణి రాగం

దెంచెను —

నంబున కెరమైె ఉపముఖ్యమంత్రి తా ॥నరుగు॥

ఖల పటాటోపి - పాపాలకు భైరవుడై

రంబు సల్పినట్టి మహాభోగి నామధేయు ॥డరుగు॥

అనుయాయుల రప్పించి – పదవులతో మెప్పించి
అంతులేని అధికారి – నియంతయా మమకారి ॥అరుగు॥

సేవ : ఊకదంపు వాచస్పతీ! బహు పరాక్! ఉపముఖ్యమంత్రీ! మహాభోగి నామధేయా! బహు పరాక్!

మహా : ముందు నా వందనములు గైకొనుము ముఖ్య మంత్రీ!

రామ : వర్ధిల్లుము వత్సా! ఊర్ధ్వలోకంబునకో, ఉత్తరధృవంబునకో పోయి సంజీవిపుల్ల దెచ్చినందులకు సంతసము. పదవీ ప్రాణదానము గావించి, ధనంబను తులసి తీర్థము సేవించి నిశ్చింతగా నుండవచ్చునా?

మహా : ఎక్కడి నిశ్చింత :

ఆంధ్రరాష్ట్రము వలదని అడ్డుజెప్పి
రాజధానిని మార్చగా రభససల్పి
ఘుడియ కొక్కరీతి ప్రకటనల్ విడిచిపుచ్చి
తెచ్చుకొంటిమి ముప్పులు తిప్పలెన్నొ.

రామ : నాదేమున్నది. ప్రజలంతా పట్టుబట్టి పరిపాలనా బాధ్యత నిర్వహించమంటే తప్పక ఒప్పుకున్నాను. పేరుకు ముఖ్యమంత్రినేగాని భారమంతయు నీదే సుమా.

సేవ : ముఖ్యమంత్రీ! తమ కన్నింట అండా దండగా హంగుదారుండు, సర్వకాల సర్వావస్థలయందు ఆశ్రితుండూ, శిష్యపరమాణువైన ప్రజానాథంగారు వేస్తూ పరుగున వచ్చుచున్నవారలు.

[ ప్రజానాథం ప్రవేశం ]

కీర్తన — ఆదితాళం - కాంభోజిరాగం

ప్రజా :

ఆర్థికమంత్రినే - స్వార్థాభిలాషినే
ఆర్భాటములు సల్పు - అవకాశవాదినే ॥ఆర్థిక॥
టక్కుటమారు - గజకర్ణ విద్యలతో
ఇంద్రజాలంబు సల్పి - ఇట్టెసాధింతు పనుల ॥ఆర్థిక॥
కుక్క తోకాబట్టి - గోదావరిని యీదన్
రామజోగి నన్ను రక్షించిపెట్టె భిక్ష ॥ఆర్థిక॥

కం. వందన మిదె మంత్రివర్య
వందన మిదె రామజోగి వందన మార్యా !
ముందుగ నా మనవి వినుమ
కుందర వదనారవిందా గురుగోవిందా !

సూత్ర : గోవిందా - గోహింద.

రామ : ఊసరవల్లికి దాసుండవు - రామభక్తుండవు - మదీయ ప్రథమ శిష్యుండవు అగు నీ భక్తి, ప్రేమవాత్సల్యంబులకు మెచ్చితిని — ఓయీ !

కీర్తన — రామోజీ - లక్ష్మోజీ మాదిరి

ఏయే వాడల తిరిగినావూ నీవు
ఎన్ని కమిటీల్ వేసినావు ?
ఖందుగ తెల్పియుంటివిగా - నీవు
కులార గించితివిగా - నీవు
ప్రస్తాపన లెన్నిజరిగెను - చెప్పుమా నా చిట్టితండ్రి
మానేసినావ ? - లంకలో మే తెంతగిట్టెను ?

ఉపమంత్రి :

తీర్థంబులను సేవించావా ! – కాలం
వ్యర్థంబుగా గడిపినావ ?
ప్రభుత్వంబు పేరుతోని – ప్రజాసభలను జరిపినావ !
మధ్యకాలములోన మన పే – రెంత మందానున్నదయ్య

ప్రజా : ఉపముఖ్యమంత్రి ఉపదేశంబును, ముఖ్యమంత్రి మంత్రంబును సర్వత్రా పఠించుచూ—

కం. ఎరువుల కంపెని విందుతో
తిరుపతి కొండెక్కినాను తీర్థముకొరకై
కరివెనగ్రామాని కరిగి
తిరిగితి శ్రీశైలమునకు తిన్నగనన్నా !
గుండెల్లో మంట గుప్పుమనె నన్నా !

పక్షపాతము పెరిగెనంచు – బంధుప్రీతి హెచ్చెనంచు
కక్షగట్టిరి ప్రజలు మనపై – భిక్షమైనను పెట్టరకటా !
జాలమింకేలా – మహాభోగి – మేలుకోవేలా !

రామ : హతోస్మి ! ఉన్నపార్టీని వదలి పదవికోసం పరకాయ ప్రవేశంచేసి, పెట్టినపార్టీని తిట్టి ప్రజలకు సేవజేయాలనే ప్రధానోద్దేశంతో పెద్దవాడి నగుటచే బాధ్యత స్వీకరించితిని. అయినా నిబ్బరములేకపోయెనే.

మహా : సేవకా ! సమావేశంబున్నదని సర్క్యులర్ చేయబడినది కదా ! తక్కుంగల మంత్రులు వి[illegible] కారణం ?

సేవ : అది యెల్లరకు ఎరుకయే మంత్రిసత్తమా ! [illegible]
చెరువులో స్తంభము ప్రతిష్ఠించుటకు [illegible]

రాచకీయ బాధితులకు బంజర్లను భరణంబులీయగా ముదుసలి మీసాల మంత్రియు వెళ్లి మూడునాళ్ళయినది.

ప్రజా : మరి ఆరోగ్య విద్యాశాఖల అమాత్యులో ?

రామ : మతి లేక, మీటింగు సంగతి గుర్తురాక అంతా యిక్కడుండి అఘోరించే దేమిటని నేనే పొమ్మన్నాను.

మహా : చెన్నపట్నంలోనున్న మన ఆఫీసుల తనిఖీ పేరుతో విద్యామంత్రి స్వగృహంబున కేగి స్వంతపనులు చూచుకొనుట పదిమందినోట ప్రాకి పత్రికల్లోకూడా పడింది.

కీర్తన — ఆదితాళం — నాదనామక్రియ రాగము

ఏమీ సేయుదు -
ఎటు దోచదు మది ॥ఇం కేమీ॥

అంతులేని కోర్కెల కల్పించి
ప్రాంతీయంబౌ భేదము బెంచిన
సుంత ప్రతిఫలము లేకపోవగా
వింత మార్పులు ఇట్లె కల్గెగా ॥ఏమి॥

సీమవాసులకు నగరమిస్తిని
కోస్తాకే హైకోర్టు నిస్తిని
సామదాన భేదంబులు చెల్లక
కామితార్థమే కల్లైపోయె ॥ఏమి॥

ప్రజా : కల్లలేగాదు. కల్లోలము చెలరేగెను మంత్రివర్యా ! రొట్టె ముక్కలు దక్కని స్వతంత్ర సభ్యుల సంరంభంతో పాటు ప్రతి పక్ష సభ్యుల ప్రతిఘటన ప్రభుత్వ పరాజయాలు పరిశీలించుట అవసరము. మనమా ?

సీ॥ ఏకాకులౌదుమని లోకనాథుని జేర్చ
చీకాకు బెంచెను చిక్కుదెచ్చె
మంత్రి పదవినుండి మాన్పించి నందుకు
మారాము బెట్టెను మనల దిట్టె
నగరిరాజే నాకు నామాలు బెట్టుచు
కుండ బ్రద్దలుగొట్టి రెండుజేసె
బంజరు భూముల పంపకం బంచును
రైతుల కూలీల రగడ బెరిగె
నందికొండని రైతులు నాంది పలుక
కల్లుగీతని కార్మికుల్ కలత బెంచ
నిందలన్నియు మోయుచు నిలచుటెట్లు
కందనా పురి కాపురం గడపు టెట్లు

గండము తప్పి పిండము బయటపడి యింతవరకు గడచినది. ఘడియ ఘడియకు సుడిగుండముల దాటుటెట్లు. ఈ అతుకుల బొంతతో అడుగు ముందు వేయుటెట్లు ?

రామ : ముళ్ళకంచెపై నడవమని యీ ముదుసలి ముఖ్య మంత్రికి ఆజ్ఞాపించుచుంటిరా! మా వేయిరూకలకు ఏలోటు రాకుండజేసి అసెంబ్లీ (ఇంద్రసభ) నాయకత్వము నీవే అధిష్ఠించుము. ప్రశ్న పరంపరలకు సమాధాన మిచ్చి సాగనంపుము. బాధ్యత నీదే సుమా !

మహా : శంకించనేల. చూస్తారుగా మన తడాఖా —

కీర్తన — బ్యాండ్ ట్యూన్

ధరాతలములో పరాయి ప్రజలను
కరవాలముతో ఖండింతున్

కట్టిన కాడిని మోయని ఎద్దుల
కఠినముగానే దండింతున్
పిచ్చి ప్రలాపన జేసెడివారిని
పచ్చడి పచ్చడి గావింతున్ -

[ నిష్క్రమణ ]

రామ : ప్రతికక్షుల ప్రశ్నలకు, ప్రజలలో అలజడికి తట్టుకొను టెట్లు? కాలము గడచుటెట్లు? - కష్టముల గట్టెక్కుటెట్లు? రామా!

కీర్తన — జేబులో బొమ్మా - మాదిరి

ఏమిరా రామ - నే జేసిన నేరమేమిరా

ఉమ్మడిరాష్ట్రమునందు ఉండగా
ఉద్దండుడనని ఉబికిపోతిని

పదవికిలోనై స్వరాష్ట్రంబులో
నిద్దురపోక వేషాలు వేస్తిని ॥ఏమిరా॥

రంగుమార్చినా ప్లేటుదిప్పినా - శృంగభంగములు తప్పవాయెను
కేసరి నేనని కేకవేసినా జూలుపట్టుకొని గేలిగొట్టిరి ॥ఏమి॥
ముసలి నక్కనని మోకరించితే ముగుదాడ్వేసి పట్టిలాగిరి
కాడి విడిచి నే పోతానంటే గంగిరెద్దువని గంతలుకట్టిరి ॥ఏమి॥

శిష్యా! సీతాకోకచిలుకలకీ వాతావరణము సరిపడను. అయిదుసాల్లు ఓటమి. ఇది ఆఖరి గండంబు. అస్మదీయ నామము కొంత జపించి ప్రజలలో ప్రచార మొనరింపుము. కాగల కార్యంబులు గంధర్వులే తీర్చగలరు.

ప్రజా : సభాసదులారా! గురుదేవుని మహిమ తెలియుట పామరుల కసాధ్యము. మాజోటి శిష్యకోటికి మహిమల తెల్పి మందుల నిచ్చినారు. కావున —

కీర్తన — ఆదితాళం

రామజోగి మందు కొనరయ్యా – బాబుల్లారా
సంచిలో ఉన్నవి మించిన మందులు
కాతాదార్లకు ఖరీదు తక్కువ ||రామ||

గురుదేవుండు రక్ష కట్టితే
కొలువులోన మీ పాదమెట్టితే
ఫలితము మాటా చెప్పగ తరమ
పట్టినదల్లా బంగారంబే ||రామ||

కాలచక్రము మారుచున్నది
మూలిక మహిమ పెరుగుచున్నది
తిరుపతినుండి శ్రీశైలంబుకు
తిరిగే రైళ్ళలో దొరికే చిటకా ||రామ||

[ తెర ]

★

# రెండో రంగం

సూత్రధారుడు :

అని యీ ప్రకారంబున ఆర్థికమంత్రియైన ప్రజానాథం గారు రామజోగి మందుఅమ్ముతూ అరిగిన తదనంతరంబ మద్యపానశాఖకు మాజీ మంత్రియు, రంగధాముని అనుంగు శిష్యుండగు లోకనాథం సభారంగమునకు ప్రవేశించు కథా క్రమం బెట్టిదనిన—

[ లోకనాథం ప్రవేశం ]

కీర్తన — పండరికీర్తన మాదిరి

రంగా రంగా రంగా రంగా రంగా యనరాదా మనసా
మంగళగీతము పాడితిగాదా మాదుగురుడ వీవే మనసా
అరువది దినములు కిరీటమిచ్చిన ఆచార్యుడ వీవే మనసా
బరువుమోయక జేబుసంస్థలో పరదేశాలకు పో మనసా

గిట్టుబాటుకొరకు – పట్టింపే లేదంట
ఆశ లున్నచోట – అస లడ్డగోలుబాట
శ్రీరంగ భక్తిపాట – అదె మాకు ముక్తిపాట ॥రం॥

: అవకాశవాదపరాయణా ! ఆరంభశూరా ! బహుపరాక్ !
రంగిపుర నివాసా ! బహుపరాక్ !

త్ర : తదనంతరంబ ఇంద్రసభలో జరుగబోవు చర్చనీయాంశంబుల ముచ్చటించుటకు క్వాలీరైతు ప్రతినిధియు, ప్రతిపక్ష

నాయకుండైన పాపారావు సభాస్థలికి విచ్చేయు కథాక్రమం బెట్టిదనిన —

[ పాపారావు ప్రవేశం ]

కీర్తన — వారణంచే వచ్చెను మాదిరి చతురశ్ర - ఏకతాళం

పాపారావే వెడలెను
ప్రజాశక్తితో - పటుతరగతితో ॥పాపా॥
ప్రజల కొక్క-మేల్ జేయని మంత్రుల
గుట్టు బట్టబయలు పెట్టుటకునై
నైరాశ్యంబును రూపుమాపుటకు
విశాలాంధ్ర నిర్మాణసాధనకు ॥పాపా॥
సస్యశ్యామల ఆంధ్రసీమకై
అహర్నిశలు కృషిసల్పు దీక్షతో ॥పాపా

సేవ : ప్రజాసేవ పరాయణా! బహుపరాక్. తమ రాకకు లోక నాథంగారు నిరీక్షించుచున్నవారలు.

లోక : నా రాజీనామా యనంతరంబు మంత్రివర్గం చేసిన చట్టంబులు దేశారిష్టముగా మారినవి. కరువు కాటకంబు లతోపాటు నిరుద్యోగసమస్య ప్రబలి గీతకార్మికుల సత్యాగ్రహ సంరంభం జరుపవలసి వచ్చింది.

పాపా : ప్రజా క్షేమంబు యోచించి ప్రతి పక్షంబునే అం[illegible] పెట్టుకొని యుండిన ఇంత గందరగోళము జరిగియుం[illegible] కాదుగదా. వినాయకుని బొడ్డులో వేలుపెట్టిన కుట్టునని తెలిసి చేసినదానికి తగిన ప్రతిఫల మనుభవిం[illegible] తప్పలేదు.

లోక : మా పార్టీలో అంతఃకలహములు రెచ్చగొట్టి కొంగల మల్లయ్యను దువ్వి, దరిజేర్చి మంత్రిపదవిని కట్టబెట్టుటచేత మా పార్టీ పెంపుదల నాశించి అనుయాయులకు కొంత సాయంబుచేయ సంకల్పించి, నాను మంత్రివర్గంబున జేరితిని. తానో నేనో ఒకరే మంత్రిగా నుండవలెనని మహాభోగి శల్యసారధ్యంబు సల్పి నన్ను సాగనంపినసంగతి జగద్విదితమే గదా !

పాపా : ప్రధానవిషయంబులో మీపార్టీ ఊగిసలాట, అవకాశవాద ఆరాధన ప్రభుత్వ దమననీతికి ప్రయోజనకారులైనవి.

లోక : ప్రతిఫలాపేక్షతో ప్రభుత్వపక్షము వహించినను ప్రజా ఒత్తిడితో తప్పులు దిద్దుకొనుచునే యుంటిమిగదా !

కం. గురువులు చెప్పినదానికి
తిరకాసే లేదటంచు తీర్థముపొందన్
పరిపూర్ణంబుగ చెడితిమి
వరములు నెరవేరలేక వచ్చితిమయ్యా !
—భారంబు మీపై వేసితిమయ్యా !

మంత్రిగానున్నట్టి గడువులో – మాకు గిట్టిన దేమిలేదు
కుక్కతోకనుబట్టి గోదావరిని యీదిన చందమాయెను
దారిజూపన్ – మీరేగతి – కోరికతీర్చన్.

ప్రజల కిచ్చిన వాగ్దానాలను భంగపరచిన యీ ప్రభుత్వం ...లించుటకే చెల్లదు. నూకుతప్పులు సైరించిన శిశు ...లుని మించినారీ అమాత్య అధినేతలు – వారొనర్చిన ...ర్యములేమి ?

సీ. చెత్తబిల్లులు జేసి కొత్తపన్నులువేసి
మొట్టి పీడించుట మొదటితప్పు
తంత్రాంగములుసల్పి మంత్రుల జీతాలు
రెట్టింపు పెంచుట రెండో తప్పు
గుంటూరు హైకోర్టు గోవింద కొట్టింప
ముందంజవేయుట మూడో తప్పు
పెట్టిన అర్జీలు బుట్టదాఖలు చేసి
నాటకం బాడుట నాల్గో తప్పు
ఐదు ఆరేడు ఎనిమిది అంతులేక
ఎంచి చూచిన తప్పులు యెన్నొ గలవు
అట్టివారితో పొత్తు నీ కెట్టులయ్యె
ప్రజలు నెగ్గించి పంపిన ఫలితమిదియ.

వ. అంతియకాక ప్రజాందోళనకు వెరచి తాము వేసిన కమిటీల సిఫార్సులను తామే అమలుపరచక శ్రీరంగనీతులు చెప్పే వీరి ప్రభుత్వంపై అవిశ్వాసము ప్రకటింప ప్రజా ప్రతినిధుల ప్రధాన కర్తవ్యము కాన —

కం. మనసిచ్చి మాటలాడుట
కనుమూయక ఉన్న స్థితిని గమనించుటయున్
వెనుదిరిగి పారజూచుట
మనుజుల కొక వన్నెదెచ్చు మహిలో గాదా!
— వీడుమింక లోలోన బాధా

రంగుటోపీల్ నింగి కెగుర
గోపురపు జండాలు కూలన్

మరపురాని ఘటన లెన్నొ
జరుగుటిక తధ్యంబు సుమ్ము
అభిమతమైనా – దెలుపుమా – సభ్యులకైనా.

లోక : మూన్నాళ్ళ ముచ్చట తీరినది. స్వతంత్ర సభ్యులను చంక నెక్కించుకొని తలుపులు మూసితిమని ప్రగల్భములు పల్కుచున్నారు. పలుకుబడిలేని ప్రజానాధానికికూడ పట్టె పగ్గాలు లేమికతన –

తే. గీ. దాపటెద్దది యెన్నడో దారిదప్పె
యెలపటెద్దయు కుమ్ముచు ఎగిరి దూకె
ఎందుజూచిన మా కింక సందులేదు
మీరె రక్షణ మా కింక మిత్రులార !

కావున నాపై మీకున్న అనుమానము తొలగించుకొనుటకు, నిజాయితీని రుజువు పరచుకొనుటకు మద్యపాన నిషేధ చట్టము రద్దుజేయుటకు మూర్తికమిటీ సిఫార్సుల నమలుపరచమని నేనే ప్రతిపాదింతును.

కీ ర్త న

అటులైన నే నిదె – పటుతరశక్తితో
కోటలో సీటుకు – తూటుపడజేసెద.

[ ని ష్క్ర మ ణ ]

# మూడో రంగం

సూత్రధారుడు :

అని యీ ప్రకారంబున పాపారావు, లోకనాథములు మంత్రివర్గముపై అవిశ్వాస తీర్మానంబును ప్రవేశపెట్టుటకు తమ బలగంబుల ఆయత్తపరచి ఇంద్రసభ కేతెంచిరి. గుండెలు బేజారెత్త, కాళ్లు గజగజవణక నోట మాటరాక తడబడుచు, రామజోగియు, ఉన్న ధైర్యము కోల్పోయి చికాకుతో, చిరాకుతో దేశం బరాజకంబేనని ఉపముఖ్య మంత్రి మహాభోగి హెచ్చరించె. కురుక్షేత్రంబున పూర్వ భాగంబున ఇరుపక్షంబులు తమ సర్వశక్తుల సమీకరించి పాల్గొన ప్రభుత్వంబు పరాజయంబుపొందె. మంత్రిమండలి రాజీనామా లిచ్చి మేడమెట్లు దిగిరి. ప్రతిపక్షంబులు విజయభేరీ మ్రోగించిరి. తదనంతరంబ —

గీతం. మంత్రివర్గపు పతనంబు మోతబుట్టె
వింతవార్తలు వ్యాపించె యింద్రపురిలో
జోలికట్టెను బిక్షకై రామజోగి
గంగతీరాన ఉన్నట్టి గురువుజోడ
సంప్రదింపుకు యేగె ఉపముఖ్యమంత్రి
బలము కల్గిన ప్రతిపక్ష నాయకుండు

మంత్రిమండలి నేర్పరతుననుచు దెల్ప
మారుపలుకక ఇంద్రుడు ధ్వారె కోట
అంతులేనట్టి అవకాశ మిదియెనంచు
లోకనాథము సల్పెను కాకిగోల
ప్లేటుమార్చెను జగపతి వాటముగను
ఇంద్రసభ రద్దుజేసెరి ఇంతలోన
కోటిగొంతులు కలసి కోలాహలంబు
ఓటు – ఎన్నికమాట ఏ నోటవిన్న !

[ తెర ]



# నాలుగో రంగం

సూత్రధారుడు:

అని యీ ప్రకారంబున ఎన్నికల యెద్దడి విన్న అనంత రంబ ప్రజలలో అలజడియు, ప్రతినిధులలో సందడియు యినుమడించె. తదనంతరంబ, రంగుడబ్బాల సంఘాని కధ్యక్షుండును, ప్రదేశ సంస్థ ప్రెసిడెంటు అయిన భూపాల రావు సభారంగమునకు ప్రవేశించు కథాక్రమం బెట్టిదనిన—

[భూపాలరావు ప్రవేశం]

కీర్తన—ఆట తాళం - అఠాణా రాగం.

నిండూ కొలునై యున్నాడె - దండిబలము జూపాడె
భూలోకము వణికించె - నీ భూపాలరావు

సేవ: నవరత్న ఖచిత సింహాసనారూఢా! మువ్వగోపాలా! బహు పరాక్!

కీర్తన

కొలువు జేరాడె - ఇలవేల్పుల పొగడుచు ||కొలువు||
ముదముమీర ప్రదేశ అధిపతి
వందిమాగధుల బృందము బొగడగ ||కొలువు||
గోపికా వస్త్రాపహరణా! బహుపరాక్.

భూపాల:

విన కోరి సేవకా వివరంబుగాను
భూపాలరావని నాపేరు యంద్రు

మంత్రి పుంగవులతో సంప్రదించుటకు
యేగుదెంచితినంచు వేగమే దెల్పు.

సేవ: భూపాలరాయా! తమను సందర్శింప అల్లదె మాజీ మంత్రులే తెంచుచున్నవారలు.

[ మంత్రులు ప్రవేశింతురు ]

భూపాల: గురువరేణ్యా! రామజోగీ! వృద్ధ పుంగవులైన మీ కిదె మా వందనములు.

[ మహాభోగి, ప్రజానాథంలను చూచి ] మిత్రులారా! మాజీ మంత్రులారా! మీ కాశీస్సులు. అనుభవజ్ఞుడను, ఆంగ్ల విద్యా పారంగతుడనైన నాకన్న మిన్నలై ఇంద్రజాలంబు సల్పిన మంత్రివర్గము నేర్పరచిన మీ అమాత్యత్రయంబు ఉద్దండులు. ఉత్తరాది ఘనుని మహిమను, మీ కీర్తిని ఏమని ప్రస్తుతింతును.

[ భ ర త నా ట్య ం ]

దశావతారానుసరణ - త్రిపుటతాళం

తగ్గధింత - తాహతధీనుత
తద్దీనుత - ధానుధణాంధిమి
తఝుంతరిత - తఝుం ఝుంతరిత
తఝుంతరిత - ఝుంతకు రేకిణ
తడికు డిడికు - డికిడికు ఢింకుకు
తక్కిణనక - తకుందరి కిణనక
తకుందదికుంద - దికుందరి తకుందక
కల్లబొల్లి - కతలనె అల్లి
ఘడియ కొక్క - రూపము మార్చి

దశావతారంబుల దాల్చి
పదవుల చేబట్టితి రార !
ముక్తి మీదె మర్కటరూపా !
బంజరులను - పంచమటంచు
పోరాటము - సల్పె రైతుల
శాంతాంతాం - శామ్మని ప్రేల్చి
సమ్మోహ బ్ర - హ్మాస్త్రంబన్న
కూలీపై - కాల్పులు జరిపి
రాజ్యంబును - పరిపాలించే
మీ లీలలు - యిలలో యెన్నో
వినుతికెక్కె - శునకవతారా !
జనులకు మేలొనరించుటయే
ఆశయమని మోసముజేసి
టక్కరియా నక్కలరీతి
కట్టుకథలు కల్పించితిరి
గోబెల్సుల మించితి రార !
భీకరమా శూకరరూపా !
నీవు రార - పత్రికలకు ప్రకటన లీర
శత్రువులను తరుమగ లేర - పాలించుట నీ సొత్తేర
ఫాలాక్షుడవన నీవేర - నీ శక్తి ఎంచతరమేర
మా భక్తుల బ్రోవగ రార - తరుణం బిది యిక లే లేర
కరుణించి దయజూడ రార -
మంత్రిసత్తమా పరాకు
మా మొర విను బహుపరాకు.
ధిమిత్త తకిట తక - తతకిట తక

రామ : కోటవెలుపలనుండి లోనజరిగిన నాటకమంతయు విని యుంటివిగదా !

ప్రజా : మంత్రిపదవులు, అరిచేతిలోని అధికారంబులు కోల్పోయి శవాకారంబుగా నిల్చినాము. రక్షకట్టి భిక్ష పెట్టవలె.

మహా : ఇది నిజమైన ఓటమి కాదు. పార్టీని అపఖ్యాతి పాలు జేయ సంకల్పించి, మంత్రివర్గంబునకు సన్నిపాత జ్వరంబు వచ్చునటులజేసి, వెన్నుపోటు పొడిచిన పార్టీ సభ్యులపై క్రమశిక్షణచర్య తీసుకోగోరుచున్నవాడను. నేను అధ్యక్షత వహించిన ఆ రోజుల్లో ఎదురుచెప్పినవారికి పదిసంవత్సరములు సంస్థనుండి తొలగింపు, మారు పల్కినవారికి మరణాంతమువరకు సభ్యత్వాస్వాంత తొలగింపు, అమలుజరిపితిని. ఇవి అత్యవసరంబులు.

భూపా : గతజల సేతుబంధంబునకు వగచిన ప్రయోజనంబులేదు. పదవీ వ్యామోహంబుకంటె సంస్థ పటిమ, ప్రజాసేవయే ముఖ్యమని యెంచితిని. మీ మీ హయాముల్లో అతిరథులు, మహారథులు ఎందరో సాగనంపబడి సంస్థకాళ్ళు, చేతులు తెగిన మొండెముగానున్నది. ఉన్న నలుగురిని వెడలగొట్టిన కండ్లులేని కబోదిపక్షిగా మారునేమో ? అయినను—

కం. కతలల్లి రెచ్చగొట్టుట
పితురీలనుచెప్పి పరుల బెదరించుటయున్
ఇతరులచే పలికించుట
సుతరామిక చేయబోకు సూత్రిది తెలుసా !
పరులన్న నీకు కంటిలో నలుసా !

నిప్పుకో చెలగాటమోయన తప్పటడుగులు ముప్పుతెచ్చును;
చెప్పకుంటే సిగ్గుచేటు, ఊరకుంటే గొర్రెదాటు —
మాటలువినుమా – మహాభోగి – నీటుజూపకుమా

ప్రజా : మీమాటలు బేసబబుగాలేవు. తృణమో, పణమో యిచ్చి పదవులతో మెప్పించకపోవుటచేతనే ప్రజాయిష్టని ప్రతీతిగన్న జగతపికూడ వ్యతిరేకిఅయినాడు.

మహా : తిన్నయింటి వాసాలలెక్కబెట్టి కొంపకు నిప్పంటించిన వారిని గురించి ప్రస్తావించితిని; కాని అన్యులవిషయము కాదు.

రామ : త్వరపడి ప్రకటనలు చేసినను, తప్పించుక తిరుగనేర్చిన తంత్రశాలివి. నీ వెప్పుడునూ మహాభోగివే. పదిమంది హంగుగల లోకనాధంను రెండునెలల్లో బయటికిగెంటి కాళహస్తీశ్వర భక్తుండును, సిద్దలకండి ప్రేరేపకుండైన ఉల్లిపాయలు పుల్లయ్యకు పదవీపట్టాభిషేకంబు సల్పితివి.

భూపాల :

తే. గీ. ఒక్కరికియైన పదవిని దక్కనీక
ఉన్న కమిటీలపనియంత సున్నజుట్టి
తలుపనైతివి నలుగురిబలము నాడు
లెక్కలేనట్టివారలె దిక్కునేడు.

మహా : చెట్టుకు చెడుకాలమువచ్చినది. ఆశ్రితులను, అనునాయకులను చేరదీసి మహాభక్తులని ముద్రవేసిననూ మరపించుట మహాకష్టము. సంస్థకధిపతులైన మీరు, మీ అనుచరులు ఎన్నికలలో పాల్గొనకుండుట ఉచితరీతిగ గోచరించుచున్నయది.

(ఢిల్లీనుండి టెలిగ్రాం - ఇరువురు తెరవెనుకకు వెళ్లుదురు.)

రామ: ఏమి శిష్యా! ఈ డింభకులిట్లు కీచులాడిన చివరకు మననోటి మట్టికొట్టరుకదా! ఎంత రభసజేసినా ముఖ్య మంత్రి పదవి మాకే ఖాయమని మాటిస్తే సరి.

ప్రజా: పర్వాలేదు గురువర్యా! తిరుమంత్రాలు మనదగ్గ రున్నంతకాలం తిరుగులేదు. పాతకోటుల కొన్ని బూజు దులిపి పదిలపరుచుకుంటే కాలము మారినప్పుడల్లా తమరూ రూపము మార్చి నన్నుమాత్రం తోకగా జేర్చండిసుమా!

భూపాల: తమవద్దకు రమ్మని పెద్దలు కబురంపినారు. గంగా జలంబుతో శుద్ధిజరిగినగాని బుద్ధిరాదని యోచన కాలాను గుణ్యంబు.

మహా: ఏ మా ప్రలాపము.

కీర్తన — ఆదితాళం - జంఝూటిరాగం

ఏలా నీవిటు బల్కగ నేలనయా
చాలింపు మాట లవేలా
దిక్కు మొక్కు లేని వారి కొక్క మేలు జేయ లేదు
నక్క వినయంబుచాలు అక్కటక్కటా!
మక్కువంత దీరగాను పక్కనున్న వారికే
దక్కను సీట్లన్ని చూడ నిక్కువంబు దానిజాడ.

భూపాల: గత ఎన్నికలలోనే ప్రతికక్షులబలము పెరిగినది. పాతకాపుల నందరినీ సంస్థలోజేర్చి స్వార్థంబును తీర్థం బుతో శుద్ధిజేసి మహేంద్రపట్టణంబునకు రమ్మని ములుకు లైన పలుకులీ టెలిగ్రాంలో ఉన్నవి. ఓరీ సేవకా! కురువృద్ధులందరికీ కబురుచేసి నూతన వస్త్రధారణంబు

గావించి నా సన్నిధికి పంపుము. అన్నట్లు మరచితిని. సైజువారీ టోపీలను సంసిద్ధముగ నుంచితివిగదా!

సేవ: పాతవాటిని బూజుదులిపి బయటపెట్టితివి స్వామీ!

కీర్తన — ఉత్తర గోగ్రహణంలోని మాదిరి

కదలిరీ కురువృద్ధులందరు కదనసీమకు ||క||

గంగతీరము నోటబోసి – గంగిరెద్దును గంతమార్చి

నెత్తిపై టోపీనిబెట్టి – విత్తనంబుల చేతబట్టి ||క||

రాజు, రంగప్పన్న భేదము – లేదు తలుపులు తెరచినాము

రామజోగికి ముద్రవేతుము – రండిమీరీ బండిలోనే ||క||

భూపాల: ఘనవిజయము మనవిజయానికి చిహ్నము.

(నెత్తిని టోపీ పెడతాడు. జోగి నీటు జూపుచు)

రామ: నేటితో పాపపంకిలముపోయి శుద్ధిజరిగినది. ఈ పార్టీకి ఆదివిరాట్టును నేనే. తిరిగి నా ప్రజలదగ్గరకు వచ్చాను. అంతే!

భూపాల: మరి నీమాటేమి ప్రజానాథా!

ప్రజా: పెద్దలైన గురుదేవుని శుద్ధిచెరిపాటుగదా! పార్టీని వదలి రావడమేగాక పదిమందిని జేర్చవలెనుగదా. మా యిష్టు లతో గూడ సంప్రదించెదను.

మహా: ఎందుకైనా మంచిది. (టోపీని యిస్తూ) రాబోవు పదవి కిదియె కిరీటంబనియెంచి జాగ్రత్తగా నుంచుకొనుము.

(ప్రజానాథం టోపీని పరిశీలించి జాగ్రత్తగా జేబులో నుంచుతాడు.)

కీర్తన — హరహరా - మాదిరి

హరా శంభూ శివ శంకర నన్నేగావరా
కోరిక లీడేర్చి తిరిగి కోట జేర్చరా

[ నిష్క్రమణ ]

భూపాల: కవాటంబుల తెరచి శివతాండవ నృత్యంబుల చేయగ లెండు —

కీర్తన

లెండిక జాగేలా - దూకండి రంగమునకు
కుప్పించెడి కురువృద్ధుల కెదురులేదు యీ జగతిలో
మెప్పించియు మా పెద్దర యిప్పింతును సీట్లు మీకు
ద్రోణుండే రామజోగి: భీష్ముండా శివ సాంబుడు
కర్ణ శ్వత్థామలు దుశ్శాసన శకుని సములు ||లెం||

[ నిష్క్రమణ ]

మహా: మంత్రివర్గము పడిపోయిన అదనుజూచుకొని మా రథంబునకు సారథ్యంబు సల్ప సిద్ధమైనాడే మువ్వగోపాలుడు. కట్టుకథలు కల్పించి తాను నాయకుడు కాదలంచెను కాబోలు. పెద్దల సన్నిధికి రమ్మని నాకు ముందే పిలుపు వచ్చెనని ఎరుంగడీ మందబుద్ధి.

కీర్తన

ఔరా కండకావరమా - గుండెబలములేని చెనటి ||ఔరా||
పదవి నే నిచ్చినది కాద - విశ్వాసమింతేని లేద
తానొకడె నాయకుడ - తారు రోడ్డును వేసి
పిచ్చిపాలెపువారి మెచ్చికోళ్ళందుకొన ||ఔరా||
(శ్రీ) కాళహస్తీశ్వరుండు చిరాయువని దీవించినాడు

స్వర్ణముఖి తీరాన - పర్ణశాలను కట్టి
నా బలము పెంపొంద - నాంది పల్కుదు నేడె ॥ఔరా॥

[ నిష్క్రమణ ]

రామ : ఆపద్ధర్మ ప్రభుత్వమైన ఆసరాఉండునని తలచితిని. ఆశ అడియాస అయినది. మరణించేవరకు యీ మంత్రిపదవి ఉండునని తలచుట మహాపరాధమా తల్లీ! పిలవని పేరంటమైనను గంగాతీరంబున కేగినా రంగుమార్పు జూపి వచ్చెద.

దండకం

హే తల్లీ!
పట్టాభిషేకంబు, యిట్టె కల్పించనీ, పదవీ వియోగంబు
పట్టించిచూపనీ, పాలనాయంత్రమే, కాలక్రమంబుగా,
మారినన్‌గానీ, మరేమైనగానీ, ముప్పులన్ దాటిపో,
తప్పులన్ ఒప్పుకో, మంత్రిగిరి కోపాటు, మహాజన్లు
పోయెగా, సభలు సత్కారాలు, సర్వంబుపోయెగా,
బేటాలు జీతాలు, మటుమాయమయ్యెగా,
బేరసారాలునూ, కారులూ పోయెగా
గ్రామకేసరిబ్రతుకు, గడపవల సొచ్చెగా
ఏరీతిసైరింతు, ఏగతిని భరియింతు
ఏమేమి యోచింతు, చల్లగా దయజూడు
తల్లీ కృపావల్లి, వాటంబుజూచినే
నాటకం బాడుదన్, కోటులన్ మార్చుదున్
మంత్రిపదవేనాకు, మనుగడమ్మా తల్లి!
అలివేలుమంగా, మొరాలించి దీవించు
తల్లి విశాలాక్షి నమస్తే నమస్తే నమః.

[ తెర ]

# అయిదో రంగం

అని యీ ప్రకారంబున రామజోగి ఇష్టదైవతా ప్రార్థనంబు సల్పి దీనారావంబుతో సభాస్థలివీడె. ఇట ఇంద్రపురిలో ఎన్నికల కోలాహలంబు భూనభోంతరాళంబులు మారుమ్రోగుచుండె. అట గంగాతీరమున కేగిన భూపాలుడు, మహాభోగి ప్రాంతీయ దురభిమానముల రెచ్చగొట్టినందుకు నూతనరాష్ట్ర పరువుమర్యాదలు అప్రతిష్ఠ పాలొనరించినందుకు పాపపరిహారార్థం త్రివేణీసంగమ స్నానమాచరించి హుటాహుటిగా దక్షిణాభిముఖంబుగా మరలివచ్చిరి. 'ఎన్నికల స్వయంవరంబు'కు చాటింపు విని పార్టీలకు ప్రతినిధులైన నాయకులు సభారంగమున కరుగుదెంచిన కథాక్రమం బెట్టిదనిన—

[ప్రదేశఅధిపతి భూపాలుడు ముందునడువ రామజోగి, మహాభోగి, ప్రజానాథం ప్రవేశింతురు. తరువాత లోకనాథం, చివరకు పాపారావు వస్తారు]

కీర్తన — మాలీపటేల్ మాటలు - మాదిరి

భూపా : ఏలనింకా ఆలోచనలు

స్వయంవరంబునకు సిద్ధమైతిమి ॥ఏలా॥

దాసుని తప్పులు దండముతో సరి

వేసిన వేషం బీనాటితో సరి ॥ఏలా॥

మహా: వంశధార, నాగావళి, చెంప
శబరి, నందికొండ, సోమశిలకు
ప్లానుగీసి కమిటీల వేస్తిమి.
ప్రారంభింతుము పదేండ్లకైనా ॥ఏల॥

రామ: ప్రజలేనేను, నేనే ప్రజలు
ఇంతకన్న నేనేమి చెప్పను? .

[రైతు కూలీల తరఫున విదూషకులుగానీ, సూత్రధారులుగాని పాల్గొన వచ్చును.]

కీర్తన (నాయుడుబావ మాదిరి)

ఒకరు: ఓటడుగ వచ్చావ – జోగయ్యా
మా మాటివ్వమంటావ – భోగయ్యా
చేసినా ఘనకార్యం – దేవయ్యా
చెప్పవయ్యా మాకు – మావయ్యా

భూపా: మాజీ ముఖ్యమంత్రీ! పూసగుచ్చినట్టు మన ఘన కార్యములను ఏకరువెట్టి ఏకధాటిగా వివరించి చెప్పుము.

రామ: ఇంత వయస్సొచ్చినవాణ్ణి మీరేంజేశారు! అని అడగట మేమిటి. చేసిందంతా కాగితాల్లో వుంది. చూపుపోయింది, తోచిందల్లా చేశాం. మాట నమ్మకం ఉండాలి, అంతే. ముదుసలిని. మా తరఫున సమాధానాలన్నీ మా భోగి లేడూ – భోగి – చెప్తాడు లే.

కీర్తన (ఆదితాళం – సావేరి)

మహా: వినుడి వినుడి మా ఘనకార్యంబులు
వివరింతును మీకు

శ్రీ ... తెలప్రాంతం. (కృష్ణా జిల్లా)

అధికంబైన పన్నులు వేసి
ఆనకట్టలకు ప్లానులకు గీయుట
రాచకీయ బాధితులకు బంజరు
భూములన్నిటిని పంచదలంచుట ॥వి॥

సంస్థలో ఉండిపోయినవారిని తిరిగి చేర్చుటొకటీ
శంకుస్థాపన జేయుచు కమిటీవేయుట మరియొకటీ
లంచగొండులని అపవాదము ఖండించుట వేరొకటీ

అంతులేవు మా ఉపన్యాసములు
వింతమైనవి మా ప్రభావములు ॥వి॥

(విదూషకులచేతిలో పూలమాల లుంటాయి. మాజీమంత్రులు మాలల వంకే చూస్తుంటారు.)

విదూషకుడు : కీర్తన

పాతకాపులంత - భోగయ్యా
పయనమైవచ్చార ? - జోగయ్యా
స్వయంవరానికే - దేవయ్యా
సిద్ధమైనిల్చార ? - మావయ్యా

మాజీమంత్రులు : ఔను, సిద్ధమే.

కీర్తన

ఏ చట్టం జేశారు - మీారు
ఎరుకజెప్పరయ్యా
బంజరుభూమి పంపకచట్టమ ?
కౌలుదారుల రక్షణచట్టమ ?
మచ్చున కొకటి నచ్చేదున్నదా ? ॥ఏ॥

నేతపనికి నామాలుపెట్టిరి
గీతపనికి గోవిందకొట్టిరి
పట్టువిడువక పీటమేసి - మా
నెత్తిన సెటగోపంబుపెట్టిరి ॥ప॥

(మాజీమంత్రులు వెనక్కి తగ్గుతారు)

ప్రజా : [ప్రవేశించి] మంత్రులు నివేదించిన ఘనకార్యంబులలో మేమూ కలిసిచేసిన సంగతి మీకు తెలియనిది కాదు. అదనం చెప్పునది గురువుగారైన రామజోగి ప్రధానిగా ఉండటం మా ప్రణాళికలో ఒక భాగం. వారు చెప్పినటుల నడవటం, వారితోపాటు మాకుకూడా ఒక పూలహారమేసి పొండి. (ప్రక్కన నిలుస్తాడు)

లోక : [ప్రవేశిస్తూ]

కీర్తన

సలాము కొడతారా - బాబూ
గులామునౌతారా - నీ గులాము నౌతారా.

పరపతి పోగా తిరుపతి కొండ
జేరి స్వామికి పాణాసరపడి
చేసిన తప్పులు సర్దుకోవటం
వీలును బట్టి కలసిపోవుటకు ॥స॥

అన్ని పార్టీల ప్రణాళికలు అమలు జరపగలము; కాన ఎవరు స్వయంవరంలో నెగ్గితే వారితో ఉంటాం.

రైతు-కూలీ: కీ ర్త న

వీరుడలె వున్నావు పాపరావా!
ఏమేమి జేశావు పాపరావా!
ఇంకేమి చేస్తావయ్యా పాపరావా!

పాపా: నిరంకుశప్రభుత్వం మా కెన్ని ఆటంకములు కల్పించినా ప్రజాసేవ చేయుచున్నాము. స్వార్థపరుల కుట్రలు బయట పెట్టి, అవినీతి, లంచగొండితనం నిర్మూలించ యత్నించుట, అలనాడు కృష్ణాపెన్నారు ప్రాజెక్టును మన నెత్తిపై రుద్ద నీయక ఆందోళనచేసి ఆపుటయేగాక-

తే. గీ. ఆంధ్రరాష్ట్రంబు తెచ్చిన అర్హులెవరు?
అధికపన్నులు వేయక ఆపెనెవరు?
నందికొండకు సలిపె నాందోళనెవరు?
పేదజనులకు బంజర్లు పంచెనెవరు?
కూలిరైతుల మేలును కోరెనెవరు?
మంత్రులైనను దీనిని మరువగలరె?

కీ ర్త న

స్వయంవరం బిది చాటానోయ్
వచ్చినవారిని చూచానోయ్

(రామజోగి నుద్దేశించి) ముక్కూ మొగమూ సరిగాలేదు
(మహాభోగిని) టక్కరిలాగా ఉన్నా డీతడు
(ప్రజానాథంతో) హక్కునుపొందే అర్హతలేదు
(భూపాలరావుతో) పోజుపెట్టినా వాజమ్మైతడు

(లోకనాథంతో) తలనాడించే దాసుండితడు

(బెదురు చూపులతో తలోక వైపుకు పారిపోతారు)

(పాపారావును జూచి) నచ్చిన వీకుడ వీవేనయ్యా

ప్రజాసేవకై పోదామయ్యా!

(పూలమాల వేస్తారు)

[ మంగళం ]

ముక్కోటి ఆంధ్రజనులు ముక్తిని బొందగాను
జననీ భారతమాత జయమంగళం

నిత్య శుభమంగళం!

[ తెర ]







# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA126B173 |
| పుస్తకం పేరు | ఓటెవరికి |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 75 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | 6,8,3 |
| లేని పేజీలు | 1, 2 |
| తయారు చేసినది | narma |
| పేజీలు విడదీసినది | narma |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | rohith |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |